శ్రీ ర స్తు.

# శ్రీమదుత్తరరామాయణము

## తృతీయాశ్వాసము.

### వాలి రావణాసురునిగర్వం బణంచి పరిభవించుట.

శా. దుష్కాంక్షల్ వివరింపఁ గ్రమ్మఱ మదాంధుం డై నృపాల
చ్ఛటా,శుష్కారణ్యదవాగ్ని తేజమున నెచ్చో నైనఁ గ్రీ
డించుచున్, నిష్కారుణ్యమునన్ ధరాజనుల హానిన్ జెం
దఁగాఁ జేయుచున్, గిష్కింధాపురి కొక్కనాఁడు వడి నేఁ
గెన్ వాలితోఁ బోరఁగన్. 1

క. ఏఁగి పురద్వారము బి
ట్టూఁగి నిలిచి తన్నుఁ జూడ నడవిదిరుగుడుల్
మూఁగికొన గగన మట్టిటు
గాఁగ లయాంబుదములీల గర్జించుటయున్. 2

క. ఆరవము విని యశోజిత
తారుఁడు తారుఁ డరుదెంచి దశముఖుఁ గని యే
మీ రావణ నీవచ్చిన
కారణ మెఱిఁగింపు మనిన గర్వమున ననున్. 3

క. వాలి మహాభుజవిక్రమ
శాలి యనఁగ నాలకించి సమరక్రీడా

భీలతఁ జూపఁగ వచ్చితి
నాలస్యం బేల పనుపు మగచర యతనిన్. 4

ఉ. నా విని తారుఁ డిట్లనియె నవ్వుచు నీ విది యేమి వెఱ్ఱివే
రావణ వాలితోడ బవరం బొనరింపఁగ నెవ్వఁ డోపుఁ బో
ష్మీవొకరుండ వేల పరమేశ్వరుఁ డైన నెదిర్చి నిల్వ లేఁ
డీవలి కాతనిఁ దొడరి యెందఱు నొచ్చిరొ నీ వెఱుంగవే.

చ. వనచరనాథునిఁ దొడర వచ్చినశూరులకీకసావళుల్
గను మదె ప్రోవులై గిరులకై వడి నున్నవి దానవేంద్ర నీ
వును జను వాలిమీఁదనసువుల్ భరియింపఁగనొల్లవేని నా
యనయిపుడేఁగినాఁడుచతురబ్ధులస్నానము లాచరింపఁగన్.

వ. అని యంత నిలువక. 7

సీ. మహితాహిగుణవేష్ట్యమానోరుమంథాన
మహీధరోన్మథితోర్మిమాలి వాలి
మాయావిముఖదైత్యమాయావనప్లోష
కేళిభీషణదావకీలి వాలి
పదఘట్టనోద్భగ్నపాదపాదపశిలో
జ్జ్వల శృంగశతసప్తశైలి వాలి
వజ్రధ్వజోత్తాలవాలవిక్షేపణో
త్పాతితనక్షత్రపాలి వాలి

ఆ. యట్టివాలిఁ దొడరి యమృతంబు ద్రావిన
వారి కైన బ్రదుకవచ్చునోటు
కాదు కూడ దతని కయ్యంబువలె నన్ను
నిపుడె దక్షిణాబ్ధి కేగు మనిన. 3

క. అత్తారుని భర్జించుచుఁ
గ్రొత్తలు వింటిమి మఱేమి క్రోఁతులపురి నం
చె త్తినమదమున దనుజకు
లోత్తముఁ డాక్షణమ దక్షిణోదధి కరిగెన్. 9

వ. అరిగి తత్ప్రదేశంబున. 10

సీ. అతులితానంతపథాక్రాంతిశాంతుఁ డై
ధరణికి దిగిన మార్తాండుఁ డనఁగ
నుత్తరదిశ మాని యొకవేడుకకు దక్షి
ణాశఁ జేరినకాంచనాద్రి యనఁగ
ననవరతాంబుపానాయాసమునఁ దీర
మాశ్రయించినబాడబాగ్ని యనఁగఁ
గరచరణాదికాంగములతోఁ గపిరూపు
దాల్చినయామ్యప్రతాప మనఁగ

తే. దుర్నిరీక్ష్యప్రభావంబుతో సుదగ్ర
తనువుతోఁ గీలికాభీలతరలవాల
వల్లితో శోణముఖవైభవంబుతోన
వంధ్యగతి సంధ్యవార్చు నవ్వాలిఁ గనియె. 11

మ. కని శాఖామృగమాత్రుఁ గాఁ దలఁచి రక్షస్స్వామి య
య్యైంద్రపుత్త్రుని వంచించి గ్రహింప నెంచి తనమంత్రుల్
దవ్వునన్ నిల్పి కన్గొనఁ దా నొక్కఁడ పుష్పకంబు డిగి
యందున్ సద్దు గా కుండ నొయ్యనఁ బాదంబుల వెట్టు
చున్ వెనుక యై యంతంత నేతేరఁగన్. 12

చ. పదములచప్పు డింత చెవిఁ బాఱినఁ గన్నులు విచ్చి వాలిగన్
తుదలనె వానిఁ గన్గొని ననుం గపటంబునఁ బొంచి పొంచిప

కైటద నని రావణుండు నిగిడెన్ వడి పీనిభుజాంతరంబునన్
బొదివిచతుఃపయోధులనుముంచెదనంచుజపించుచున్నెడన్.

మ. చరణాగ్రంబులఁ డిన్నగా నడిచిపశ్చాద్భాగమున్ జేరియా
శరుఁడున్ మస్తము లోరఁ జేసికొని హస్తంబుల్ పయిన్
జాఁచినన్, హరి దంతిన్ గ్రహియించునట్లు ప్రబలుం
డవ్వాలి బల్పుండిటన్, శిరముల్ ప్రక్కలు బాహుపంక్తు
లిఱికించెన్ జండసత్త్వంబునన్. 14

ఉ. ప్రక్కలఁజక్కగానదిమిబాహుశిరఃప్రముఖాఖిలాంగముల్
మిక్కిలి నొవ్వఁ జేయుచు నమేయబలంబున వాలిమింటికిన్
గ్రక్కుననుద్గమించెఁ దనుఁ గన్గొని వేల్పులు సిద్ధసాధ్యుల
మ్మక్కమహాపరాక్రమసమగ్రుఁడితండని సంస్తుతింపఁగన్. 15

ఆ. ఇటుల యుద్ధమించి యింద్రునిగారాబు
పట్టి చిలువ నొడిసి పట్టి పఱచు
పన్నగారిదారిఁ బశ్చిమాంబుధిఁ జేర
నరుగ నంతలోన నద్భుతముగ. 16

శా. ఆకాశంబున కడ్డ మేగినప్రహస్తాద్యాసురామాత్యుల
ప్పాకారిప్రియసూతివాలజనితప్రత్యగ్రజంఝానిలో
ద్రేకం బోర్వక తూలికల్ చెదరురీతిన్ మేఘముల్ విచ్చిచీ
కాకై పోయెడుజోకనొచ్చిచనిరాకంపింపసర్వాంగముల్.

క. తోయదమున్ గొనిపోయెడు
వాయువువలె వాలి పంక్తివదను నిటుల కొం
పోయి వడిఁ బశ్చిమాంబుధి
తోయముల మునింగి నియమధూర్వహమతి యై. 18

చ. ఇరవుగనప్పయోధిఘటియింపఁగలట్టిక్రియల్ ఘటించి యు
త్తరజలరాశికిన్ జని యథావిధిఁ దానముఁ జేసి పంక్తికం
ధరు నలవోక సందిటను దాల్చియె తూరుపువార్ధిఁ జేరియం
దురుజపనిష్ఠలెల్ల నియమోన్నతిఁ దీర్చి యివ్విధంబునన్.

మ. కృతకృత్యుం డయి యింద్రనందనుఁడు కిష్కింధాపురో
ద్యానప,ద్ధతిఁ బ్రాపించి భుజాంతరంబున మహాదైన్యంబు
తో వ్రేలున,ద్దితిజాధీశ్వరు నందు వైచి నగుచున్ దేవారి
హా యెప్పు డం,చతనిన్ జూడనివానియట్లడుగ వీతాహం
క్రియాద్ధత్యుఁ డై. 20

మ. తను వాద్యంతము చెమ్మరింప భయగాద్గద్యంబు గాన్పిం
పఁ గ,న్గొనలన్ బాష్పము లావరింప వడఁకున్ దోడ్తోఁ
బ్రవర్తింప బో,రున నిట్టూర్పులు మించ లేచి దనుజేంద్రుం
డంత దాఁ గ్రమ్మఱన్, జననం బొందితి నంచు నెంచి యని
యెన్ శాఖామృగస్వామితోన్. 21

చ. బలియుఁడ వైన నీవె నిరపాయదయాఢ్యుఁడ వైన నీవె ని
శ్చలమతి వైన నీవె విలసద్ధృతి వైనను నీవె కాక నీ
కిల నొకరుండు సాటి యగునే సురనాథకుమార నిన్ను నేఁ
దెలిసితి నేఁడు నిక్కముగఁ దీఱె మదీయమదాంధకారముల్.

శా. కైలాసం బగలించి శంకరునిచే ఖడ్గంబుఁ బ్రాపించి ది
క్పాలశ్రేణిఁ గలంచి మించిన ననున్ గక్షాంతరాళంబునన్
దూలంబున్ బలె వ్రేలఁ జేసితివి నీదోశ్శక్తిమెప్రాలన్ వృథా
స్థూలం బయ్యె మదీయశౌర్య మఖిలస్తుత్యప్రభావోదయా.

చ. గరుడురయంబు మానసము గాంచిన వేగము చండమారుత
త్వరయు భవజ్జవంబున లవంబున కైనను సాటి వచ్చునే

సురగరుడోరగాసురులఁ జూచితి నీదృశబాహువిక్రమ
స్ఫురణ లెఱుంగసత్యమిదిస్తోత్రముగాదు ప్లవంగపుంగవా.

ఉ. అన్నవు నీవు భానుసుతు నట్టుల నేనును గూర్మితమ్ముఁడన్
నన్నుఁ గృపన్ గనుంగొనుము నాథన మంతయునీదినీవునే
నెన్నఁటికిట్లు చెల్మివహియించియెయుండుదమన్ననింద్రజుం
డన్నరభోజితోడ నపు డట్టులె సఖ్యము చేసి వేడుకన్.

క. బాంధవుఁ డగునాతనిఁ గి
ష్కింధకుఁ దోడుకొని పోయి స్నేహమున జగ
ద్బాంధవసుతుఁ జూచినగతి
బంధురమతిఁ జూచి మిగుల బహుమతి చేసెన్. 26

క. మాసముదారత నచ్చట
మాసము వసియించి మిగుల మైత్రియుఁ గని య
య్యాసురపతి సత్కృతుఁ డై
యాసురపతిసుతుఁడు పసుప నరిగె నృపాలా. 27

వ. అని పలికి యగస్త్యమునిశేఖరుండు రఘువీరశేఖరునకు
వెండియు ని ట్లనియె. 28

మ. చతురంభోధుల దైత్యు ముంచిన భుజాశౌర్యోత్థ్యునవ్వా
సవిన్, హతుఁ గావించితి వాక్కుతూపున సమిత్రామాత్య
పుత్త్రంబుగాఁ, గృతవీర్యాత్మజుఁ ద్రుంచివైచిన త్రిలోకీవర్ణి
తున్ రేణుకా, సుతు నిర్జించితి వెంచ శక్యమె నినున్
క్షోణీసుతాధీశ్వరా. 29

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము - తృతీయాశ్వాసము.



### శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట.

వ. సాత్యకియును సముచితప్రకారంబునం బూజితుం డయ్యెఁ
దదనంతరంబ నిజాసనాసీనులయి తనమొగంబునం జూడ్కి
నిలిపి యున్న దుర్యోధనాదులతో మాధవుండు మధుర
సంభాషణంబులు చేయుచుండె నట్టియెడ. 1

తే. సముచితంబుగఁ గూరలచంద ముగ్గ
డించి కుడుపు తెఱంగు పుట్టించి పలుకు
నాసుయోధనుతోఁ గృష్ణుఁ డచటఁ దాను
గుడువనొల్లక యునికి యేర్పడఁగఁజెప్పె. 2

వ. చెప్పిన విని దుర్యోధనుండు సూర్యసూనువదనం బవలో
కించి యల్లన యి ట్లనియె. 3

క. హరిపలికినవిధ మెంతయు
నెర వై యున్నయది వింటె యిమ్మాట తెఱం
గరయుదము తొలుత నీ వెను
పరిచందం బెల్ల నెఱుక పడియెడుఁ బిదపన్. 4

వ. అని యచ్యుతున కి ట్లనియె. 5

తే. వలయునన్నపానంబులు పలుదెఱఁగుల
నేర్పువిధముల నే మొడఁగూర్చి వేడ్క

నున్న నీ వుపయోగింప నొల్లకునికి
బాంధవమునకు నీతికి బాహిరంబు. 6

క. కౌరవులకుఁ బాండవులకు
నారయ నీ వొక్కరూప యసదృశధర్మా
చారుండవు రాజునకుం
గూరుతు గత మేమి యి ట్లగుటకుం జెపుమా. 7

క. అనుడు నుపేంద్రుఁడు మనుజేం
ద్రున కి ట్లను దూత లెందుఁ బోలివోలి గుడువం
గొనఁ గట్టఁ బోడఁగుదు రె వ
చ్చినకార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్. 8

వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కి ట్లనియె. 9

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱుఁ
దీఱ కుండు దాని తెఱఁగు దగిన
యప్పు డాడ రాదె యిప్పుడు ముకుఁద్రాటఁ
గాలు గ్రువ్వ నేల కమలనాభ. 10

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్ల పనులం జెప్పుట యొప్పుఁగాక కుడువ నొల్ల ననం దగునె దీనికిం గారణంబు నాయెఱింగినయది లేదు విచారింపక పలికి తనిన మందరధరుండు మందస్మితంబుతో నందఱం గలయం గనుంగొని ధార్తరాష్ట్రుకరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చులీలం గేల నమర్చి యిట్టిమాటలు తేట పఱుపవలయు నేని వినుమని యతని కి ట్లనియె. 11

చ. ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడుకూడది లెస్సకూడు
దక్కయనయహీనతం దమకు నాపద యైనెడ నిట్టు నట్టు

నేమియు నన లేనికూడెదిఁ క్షేమవడి నైయె చను నీవు మా
దేసం, బ్రియుఁడవు గావు మాకు ధృతిపెం పఱ నాపద
లే దోకింతయున్. 12

వ. అట్లుం గాక. 13

క. పగవారియింటఁ గుడిచిన
నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ
దగ వొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో. 14

వ. నేను బగతుండనె యంటేని. 15

క. అలుగుదు పాండవులకు వా
రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టులముగఁ దమప్రాణములకు
నలుగుజనులు పగతు రగుట యనుమానం బే. 16

ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య
మాది గాఁగఁ గీడె యాచరింతు
పుణ్యపరులు వోడఁ బుట్టువు లార్యులు
వైర మెత్తఁ దగునె వారితోడ. 17

వ. ఇట్లున్న మీయందఱయన్నంబులు దుష్టాన్నంబులు విదురుం
డొక్కనియన్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితిఁ గావున
నందుఁ బోయెద నని చెప్పి యజ్ఞనపతి యనుమతిచేయఁ
జనునప్పుడు తోడన బాహ్లికభీష్మాదికౌరవులును గుంభ
సంభవప్రముఖులైన మాన్యులును జని మాధవుతోడ
మాయిండ్ల నెల్లను గానిక లాయితంబులు చేసికొని నీవు

విజయంచేయుటకు నెదుళ్లు చూచుచున్నవ్వార మని పల్కి-
ప్రార్థించిన నే నన్నిచోట్లకు వచ్చినవాఁడన యందఱ యర్చ
నలుం గైకొంటిన మీరు నిలువుం డని వారల నిలిపి
విదురగృహంబునకుం బోయిన. 18

సీ. సంభ్రమస్నేహనిశ్చలభక్తియుక్తిఁ బ
విత్రమజ్జనము గావించి విదురుఁ
డెల్లవంటకములు నేర్పడ బోనాలు
వేర్పింప నెంతయుఁ బ్రీతి ముంద
రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి
సపరివారముగ విశాలరమ్య
పూతస్థలంబునఁ బుండరీకాక్షుండు
దమ్ముండుఁ దాను నుత్సవ మెలర్ప
తే. సరసరంజకమహనీయసంప్రయోగ
మగుచతుర్విధహ్యాద్యాన్న మారగించె
లలితసంభావనామంజులంబు లైన
పలుకు లెడనెడ విదురున కెలమి యొసఁగ. 19

వ. అతండును. 20

క. గోవింద సంభ్రమము సం
భావింపుము మాకు నిదియ పరమధనం బొం
డేవిధమున నీ కర్చన
గావింపం జాలువాఁడు గలఁడే యెందున్. 21

వ. అని మఱియు నత్యంతవినయవాక్యమ్ముల నారాధించు
చుండె నిట్లు కృతాహారుం డైనహరికిఁ జందనచర్చాద్యర్చ
నంబు లాచరించి యవ్విదురుండు కృతార్థుండై యుండఁ

గవిగణికప్రముఖనిఖిలవిద్వజ్జనంబులు గాయకపాఠకవాం శికవైణికాది వినోదపాత్రంబులు నప్పరమేశ్వరుం గాన వచ్చి ప్రొద్దు వుచ్చి యభిమతార్థంబులు వడసి చనిరి రాత్రి యగుటయుం దగినయభ్యంతరమందిరంబున హంసతూలి కాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాస నంబున నుండి. 22

ఆ. విదురుఁ డిట్టులనియె నిదియొకకార్యంబు
గాఁగఁబూని యిందు రాఁగఁ దగునె
దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ
మాట వినునె దురభిమానఘనుఁడు. 23

క. వచ్చినసైన్యంబులఁ గని
పెచ్చుపెరిఁగి నాఁడు ద్రోణభీష్ములలావుల్
నచ్చియుఁ గర్ణుం డొక్కఁడ
యిచ్చుఁ దనకు విజయమనియు నెంతయుఁ బొంగున్. 24

వ. నీ విట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడం బాఱి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘింపం గలవారు పాండునందనులకు నేమియు నీ కుండువారు దార యీధాత్రియంతయు బీఱు వోవకుండ నేలువారు వారిం గూడినరాజులెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగపడినవారు గావునఁ గర్ణుతో నేకా ర్థుల మై చత్తుము గెలుతు మింతియ కాని యొండు లేదని నిశ్చయించికొని యున్నవా రట్లగుటం జేసి దుర్యోధనుండు గండు మిగిలి యున్నవాఁడు సంధి గానేరదు వారల కంద ఱకు నిది ప్రాప్తకాలంబై యున్నయది యెట్లును నుడుగ

నేర్చినవారు గా రిట్లు దమ్మెఱుంగని దుష్టాత్ముల నడుమం గూర్చుండుటయు నవ్వెంగలివిత్తులఱచుపీఱేఁడియఱపులకు వంక లొత్తి మాఱు చెప్పుటయు నొప్పక యుండు వెడంగు లగుటం గార్యవచనంబు లెఱుంగరు మొఱకు లగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు వారలతలంపులు గీడు నీమహాసీయప్రభావబుద్ధిపౌరుషంబు లే నెఱుంగుదు నయి నను బాండవేయులపై స్నేహంబునను నీమీఁదిభక్తినిం జెప్పెద నందుఁ బోవలదనిన వాసుదేవుం డతని కిట్లనియె.



శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో మున్నతండు చేసినదుర్ణయంబు చెప్పుట.

క. మొనతలఁ బడియెదు నీచె
ప్పినయట్టుల తడవు లేదు బిరుదుల రై నీ
వును వీరు నిలువుఁ డిదె భం
డన మెల్లియ వచ్చె నుఱుటలు గనుఁ డింకన్. 26

సీ. అరయంగఁ దప్పు లే దంటి నీవలనఁ గీ
డొకనాఁడు చేసియు నొక్కనాఁడు
చేయవె నీజనించినయది యాదిగా
నుడుగక పాండవేయులకుఁ జాల
నెగ్గు చేసితి విష మిడి పెనుఁబాములఁ
గఱపించి నీరిలోఁ గట్టి త్రోచి
లక్కయిల్ గాల్చి పెక్కుభంగులఁ జంపఁ
దలఁచినఁ జావక ధర్మరక్షఁ

ఆ. జేసి నెగడి రాచసిరి నొంది యున్నఁ జూ
పోప కీవు తీవ్రపాపబుద్ధిఁ

గనమి జూద మొకటి కల్పించి కపటంబు
చేయ దానవెల్ల చేటుఁ బుట్టె. 27

తే. అన్నదమ్ముల నెత్తంబు లాడి సతుల
తలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టివారి నెందుఁ
దడవుమా నీ వాకండవు దక్క నధిప. 28

ఉ. అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడినమాటలు గొల్వులోపలం
జెప్పెడునట్టివే కులము శీలముఁ గల్గినపుణ్యకాంతక
ట్లొప్పమి సేయు టెల్లఁగనియున్న జనంబులు వించునుండఁగాఁ
ద ప్పొకయింత లే దనువిధం బది నీక చనుం గుమారకా.

తే. ఎత్తి విడిసినవా రని యెల్లతప్పుఁ
బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకు గలదె
ద్రోణభీష్ములుఁ దండ్రియుఁ దోడుతోడఁ
జెప్పుతగుమాట లేమియుఁ జెవులుచొరవు. 30

క. శాంతిం బొందుట నీకుం
గుంతీపుత్రులకు మే లగుఁ దానిక యే
నింతయు నాడెద నది నీ
కెంతయు రుచియింప కునికి యెఱిఁగి యెఱిఁగియున్. 31

వ. అని యిట్లు నారాయణుండు నానాప్రకారంబులం జెప్పుటకుఁ గటకటంబడియెడుదుర్యోధనునకు దుశ్శాసనుండి ట్లనియె. 32

మ. జనకుండుం గురుభీష్ములుం దగినకర్జం బాప్తులై నీకుఁ బ్రీ
తి నెఱింగించు తెఱంగు గాదుత్తమబుద్ధిం బోయి సంధాన మి

ట్లొనరం జేయకయున్న గృష్ణునకు నిన్నొప్పించువా రింతవ
ట్టు నిజం బిచ్చుట నింక నీయునికి నెట్లుంగీడుపుట్టుం జుమీ.

ఆ. అనిన బాహ్లికాదు లగుకురువృద్ధుల
నాత్మజనకుఁ గృష్ణు నాదరింప
కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన
లేచి పోయె సంచలించెఁ గొలువు. 34

తే. అతనివెనుకన కర్ణుండు ననుజగణము
శకునియును వారిపొందైనజనపతులును
బోయి రమ్మెయిఁ జని యొక్కప్రోవు గట్టి
వేఱ యంతంత నుండిరి గోఱడమున. 35

వ. ఇట్లున్నం గనుంగొని గాంగేయుండు. 36

చ. ఇతఁడిది యేల క్రొవ్వి ధరణీశుఁడనంచు వృథాభిమానియై
మతి చెడి లోభమోహమదమత్సరముల్ దనుఁద్రిప్పనిట్లసం
గతమునఁబోయెవీనివెనుకం జని రేమి దలంచియో మహీ
పతులునువీరుగొందఱతిభారపుమానుసు లేమిచేయుదున్.

తే. అని జనార్దనుఁ గనుఁగొని యకట కాల
పక్వ మయ్యె నీనరపతిప్రతతి యెల్ల
ననుడుఁ దగువారిదెసఁ గలయంగఁ జూచి
తగవుమెయి నిట్టు లనియె నన్నగధరుండు. 38

శా. ఈదుర్యోధనుఁ డింతగర్వియగునే యీయున్నవారెల్లనా
చేదైన్యంబునఁబొందుటొప్పదని చర్చింపండ యీభంగికిఁ
లేదెయొండుదెఱంగు సత్కులముఁబాలింపంగ వర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ బోదే భేద మీజాతికిన్.

ఉ. కంసుఁడు నిట్లు తండ్రిమది గందెడుచంద మొనర్చి ధర్మవి
ధ్వంసము చేసినం గులమువారలు నాకెఱిఁగింప నేను దు
ర్మాంసముగోయువైద్యునిక్రమంబుననాతనిద్రుంచియన్వయో
త్తంసముఁ జేయనే జనకుఁదద్విధ మొప్పదె మీరుఁ జేసినన్.

ఆ. అంతతోడ నెల్లయాపదలును దీఱు
వంశ మధికగౌరవంబు నొందుఁ
గూడి మనుట గలుగుఁ గురుపాండవులకు ని
త్తెఱఁగుచూడ మీకు సుఖవకాదె. 41

వ. అనిన విని ధృతరాష్ట్రుం డుదరిపడి విదురున కిట్లనియె. 42



# భాస్కర రామాయణము

## ఆరణ్యకాండము - ద్వితీయాశ్వాసము.



### మారీచుఁడు మాయాకురంగమై రామాశ్రమమునకు వచ్చుట.

సీ. రుచిరవైడూర్యంబు రూపార నచ్చున
వచ్చినవిధమున వదన మమర
భర్మనిర్మితపద్మపత్త్రంబు లలవడ
నొత్తినక్రియఁ గర్ణయుగము మెఱయ
లలితమాణిక్యశలాకలలాగు మై
కొన నమర్చినభంగిఁ గొమ్ము లొప్ప
నింద్రనీలములబాగేర్పడ ద్రచ్చి వై
చినగతి గొరిజలు చెలువు మిగుల
తే. నుదర మిందుబింబద్యుతి నుల్లసిల్లఁ
గనకకేసరాంకురరోమకాంతి నిగుడ
నొక్కమాయాకురంగమై యొయ్యనొయ్యఁ
జనియె నిలుచుచు నాపర్ణశాలకడకు. 1

సీ. నెలలోనియిఱ్ఱికి నీలకంఠునిచేతఁ
బొలుపారులేడికిఁ బుట్టెనొక్కొ
యజుఁ డన్నిరత్నంబు లందునుం గలుగుక్రొ
మ్మించుల దీనిఁ గల్పించెనొక్కొ
రోహిణాచలము మేరువుఁ గూడి యురుతర
ప్రభల నీహరిణంబుఁ బడసెనొక్కొ
క్రొక్కారుమెఱుఁగులుఁ జుక్కలయొఱపును
గలసి యీమృగమయి వెలసెనొక్కొ

తే. దీనిఁబోలంగజంతువుల్ త్రిభువనముల
యందు మఱికలవొకో యని యాత్మ మెచ్చి
ప్రీతి వనదేవతలు చూడ సీతదృష్టి
మార్గమున కల్లఁ జనియె నమ్మాయయిఱ్ఱి. 2

ఉ. అత్తఱి నెమ్మొగంబుజిగి నచ్చుపువెన్నెలగాయ నింపు ద
ళ్కొత్తుసమీపభూజముల నొయ్యనఁ బువ్వులు గోయుచు
న్నరా,జోత్తముదేవి చూచెఁ జిగు రొత్తెడువేడ్కలు సం
దడింపఁగన్,గ్రొత్తమెఱుంగు లేణమునకుం దనకున్ నడు
మెల్ల నిండఁగన్. 3

మహాస్రగ్ధర. ధరణీసంజాత ప్రీతిం దనుఁ గనుఁగొన నుద్వృద్ధ
తిం బాఱుఁ దాఱుం, బోరి డాయుం బూరిమేయుం బోలు
పుగ నిగుడుం బొంగుఁ గ్రుంగుం జెలంగుం, దిరుగుం
గుప్పించు మించున్ దెసల నెసఁగ వర్తించు వే చౌకళిం
చున్, గర మొప్ప న్నిల్చుఁ బొల్చుం గనకహరిణ మక్కా
ననాంతంబులోనన్. 4

క. మరగినవిధమునఁ జేరువఁ
దిరుగుం బసిగొనుచుఁ గలయఁ దృణములు వెదకున్
ఖురపుటమునఁ గడుపొయ్యనఁ
బరికికొనుచుఁ జక్కనిలుచుఁ బలుమఱునెదురన్. 5

క. ఈలీలం బోలయఁగ నా
లోలాక్షి విలోలయై విలోకించి మహీ
పాలుని లక్ష్మణుఁ బిలిచినఁ
జాలఁగ వెస నేఁగి కనిరి సారంగంబున్. 6

తే. అపుడు లక్ష్మణుఁ డేర్పడ నామృగంబు
నద్భుతాకారవిలసన మధికసంశ
యాత్ముఁడై చూచి నిజబుద్ధి నసురమాయ
గానిరూపించి యనియె నగ్రజునితోడ. 7

మ. మనలం బిల్చుట భూమిపుత్త్రి మది నిమ్మాయామృగంబుల్
నిజం, బని భావింపఁగఁబోలు వీఁ డసుర మాయారూపుఁ
డెందేని నొక్కనెపం బిమ్మెయిఁ జూపి చిక్కుపఱుపంగాఁ
జూచె మోహంబునన్, జననాథోత్తమ పట్టఁ జూచెదు
సుమీ చర్చింప కుద్యద్గతిన్. 8

క. అని పలుకఁగ నాలోనన
జనకజ పతి డగ్గఱంగఁ జనుదెంచి కనుం
గొను రాజముఖ్య యొప్పుల
గని యగునీమృగవిలాస కమనీయగతుల్. 9

క. కరువున గండరువునఁ జి
త్తరువున నినచంద్రరుచులఁ దారలరుచులన్
హరిహరధాత్రాదుల కీ
హరిణముసరిరూపు వడయ నలవియె యెందున్. 10

వ. అనుచు సాభిలాషంబుగాఁ బెక్కుచందంబులంగొనియాడి.

చ. అలఘుచరిత్ర దీని వెర వారఁగ నెమ్మెయినైనఁ బట్టి తే
వలయు నరేంద్ర మిమ్ముఁబనిఁబంపెడుదాననె దీనిమీఁదమీ
రలరుచుఁజూచుభంగిఁగనియాడితిఁగన్నులపండువెప్పుడున్
గలుగదె యెల్లనాఁడు నధికంబుగ నీమృగరత్నమబ్బినన్.

చ. అనికడువేడ్కతోఁబ్రియునినామృగలోచనవేఁడినన్ మనం
బునఁ గడునుత్సవం బొదవఁ బోయెదనిప్పుడ పట్టి తెచ్చెదం

గనుఁగొను మంచుఁబూననిజకాంతునితో ననురాగభావసం
జనితవికాసభాసి యయి జానకి యిట్లనుఁ గౌతుకంబునన్.

తే. ఎట్లు గ్రుంకులు వెట్టుచు నేచి పట్టి
నీక యెట పాఱెనేని పోనీక శరము
పాలుపడఁజేసి తెమ్ము భూపాల యొప్పఁ
జారుతర మైనయీమృగచర్మమైన. 14

వ. అని పల్కునవసరంబున సౌమిత్రి విన్నఁబోవుచు నింత
యెఱుంగమి గలదె యసురమాయం దగిలి రామచంద్రు
నకు హరిణరూపం బై నకలంకంబొందె ననుచుఁ దద్విఘ్న
వచనంబు లాడ నోడి వెఱచుచు నుండె వెండియు రఘు
వరుండు. 15

క. సౌమిత్రిఁ బిలిచి లక్ష్మణ
యీమృగముం దనకుఁ దెచ్చి యిమ్మనియెడు నా
భూమిజ విలునమ్ములుఁ దె
మ్మేమఱకుము వచ్చునంత కిట మీాఁవదినెన్. 16

క. అన విని యతఁ డన్నకు ని
ట్లనుఁ దాపసహింస చేయునలమారీచుం
డనువాఁడు కనకమృగమై
చను దెంచెం బొసఁగ విట్టిచందము లెందున్. 17

క. వసుమతి మన మింతకు మును
వసుధాధిప కంటిమే సువర్ణమృగము రా
క్షసకృత్య మ్మిది వలవదు
మసలుఁడు సతు లతులచపలమతులు దలంపన్. 18

శ్రీరామమూర్తి మాయాకురంగంబుం బట్ట నరుగుట.

వ. అనిన విని కౌసల్యానందనుండు సుమిత్రానందనున కిట్లనియె.

క. అడిగినవస్తువు లెప్పుడు
నెడపక గలిగించుకతన నీయబల మనం
బొడఁబడి పురి నున్నట్టుల
కడు ముదమునఁ బొంది యుండుఁ గాంతారమునన్. 20

తే. పసిఁడిమృగము నిక్కం బైనఁ బట్టి తెచ్చి
జనకసుతకోర్కి దీర్చెద సమ్మదమున
లేక మాయామృగం బైన లీలఁ ద్రుంచి
హితమొనర్చెద మునులకు నెట్లు లెస్స. 21

క. అని పలికి విపులబాణా
సనమును గవదొనలు పూని సౌమిత్రిఁ గనుం
గొని జనకతనయ సుమ్మీ
యని పలుమఱు నప్పగించి యట చన నదియున్. 22

చ. నిలువక మెల్ల దాఱు నటు నిల్చిన మెల్పు నటించుఁ బట్టఁ జే
యలఁతికిఁ జేరినం జిదిమినట్టులు దూరము దాఁటుఁ గ్రమ్మఱం
గొలఁదికి డాసినం బొదలు గొందులు చొచ్చు నడంగె నన్న న
వ్వలఁ బొడచూపు మాటుగొని వచ్చిన వెండియు నుండు
నొంచెడన్. 23

వ. అప్పుడు రఘువరుం డపరభాగనిరూఢవరాసనుండును నాకుం
చితాంగుండు నగుచు నొయ్యన. 24

క. మునివ్రేళ్లు నేల మోపుచు
వెనుకదెసం జప్పుడుగాక వెరవునఁ గదియం

దనుఁ జూచియు తెప్పలకద
లును లేకటు నిలుచు నిలిచి లోఁబడుకోలఁదిన్. 25

క. పిఱిఁదికిఁ బో నిచ్చినవి
ల్లఱితికి నై యల్లఁ జాఁప నది గనుఁగొని పె
ల్లుఱికి చను లతలు ఫులువడఁ
జిఱుముం గడు నాసపుట్ట శృంగాగ్రములన్. 26

వ. ఇవ్విధంబునం బెక్కుదూరం బరిగి యెండమావు లుదకంబు
లనుతలంపున నవ్వల నివ్వలం దోఁచుచు నధికతృష్ణాతి
రేకంబునం దగులుమృగపతియునుంబోలె నారామచం
ద్రుండు. 27

సీ. పొదదండగాఁ జేరి యుదరిపాటునఁ బట్టఁ
బొంచెద నంచును బొంచిపొంచి
మొక్కలంబున నున్న ముట్టి పర్వన డయ్యఁ
బాఱి పట్టెద నని పాఱిపాఱి
దొడ్డికట్టై యున్న తోరంపుటీరంబుఁ
జొరఁ జోపి వెనువెంటఁ దిరిగితిరిగి
పొరకలు మెయినిండఁ బూరించుకొని పచ్చ
చెట్టుచందంబునఁ జేరిచేరి

తే. మడుఁగులకు నల్ల దార్చుచు నడుసు గలుగు
కోలఁదిఁ బట్టంగ నగు నని వెలిచి వెలిచి
యలమృగమువెంట నొయ్యె నాసాసఁ దిరిగె
నామృగవ్యాధరుద్రుఁడో యనఁగ విభుఁడు. 28

వ. మఱియు నందంద తఱుముచుం బ్రిదిలిపోవుచు నిత్తెఱం
గునం దార్చుసమయంబున. 29

సీ. నీరాక యెఱుఁగుదు నిక్కంబు ననుమాడ్కి
నోరచూపునఁ జేరి యొయ్యగిలుపుఁ
జందురునిక్కృతో సమరంబునకు నేగు
పగిదిఁ గుప్పించి యుప్పర మెగయును
సురిఁగిపోయెద నన్నుఁ జొరఁజోటు లే దింక
నీవె దిక్కనుభంగి నెదురువచ్చుఁ
దనయకోర్కికి నుర్వి తనుఁ బట్టు ననుగతి
నవనిపై నిలువ కందంద దాఁటు

ఆ. మరలిచూచుఁ దిరుగు మఱియు నద్దెసఁ బాఱు
నలసినట్ల నిలుచు నల్ల బెదరు
మెలఁగి దెసలు వెదకు మెడయెత్తి గాలిది
క్కరయు నక్కురంగ మచట నచట. 30

క. నిలువక తరుగుల్మాంతర
ములలో వడిఁ బాఱునపుడు మొగుళులు వాఱం
దలతలవెలుఁగుచు నెడనెడఁ
బలుమఱుఁ జందురుఁడుఁ దోఁచుపగిదిం దోఁచున్. 31

వ. ఇట్లు దోఁచిన విస్మితుం డగుచు. 32

మ. కదియం జొప్పడ కంతకంతకట నాకాంతారమధ్యంబునం
దదియొందుంగమియించినంబిదపడయ్యంబాఱుచుంబట్టలే
కిది మాయామృగ మచ్చుగా ననుచు నింకేదీనిఁబోనీకచం
పెద దూరంబెలయించెనంచునలుకంబృథ్వీశుఁడేతేరఁగన్.

# భాస్కరరామాయణము

## సుందరకాండము.

---

సీ. చరణాగ్రమున నీభుజాదర్ప మడఁచిన
ధూర్జటివిలు లీలఁ ద్రుంచి వైచె
వాలపాశంబున వడి నిన్నుఁ గట్టిన
వాలి నొక్కమ్మునఁ గూలనేసె
నని నిన్నుఁ జెఱగొన్న యర్జునుఁ బొరిగొన్న
పరశురాముని నాజి భంగపఱచెఁ
గడిమిమై నొక్కఁడ ఖరదూషణాదులఁ
బదునాల్గు వేవుర బారిసమరె
తే. నమ్మహాధనుర్ధరున కెగ్గాచరించి
హరిహరబ్రహ్మశక్రాదు లైన నతని
భయదనిర్ఘాతసంఘాతపాతశాత
బాణఘాతహాతులు గాక బ్రదుకఁ గలరె. 1

చ. ఉరవడి రాఘవాస్త్రతతు లుగ్రతరార్చుల మింట నంట నీ
కరము లురంబు నంగములుఁ గంఠము లాస్యము లంఘ్రు
లూరులున్, శిరములు మర్మముల్ బహులుఁ జించుచుఁ ద్రుం
చుచు నుచ్చిపాఱుచున్, మురియలు చేయుచున్ నిగుడ
మూఁడుజగంబులు నాఁప నోపునే. 2

శా. శ్రేణీభూతములై దిగంతముల విక్షేపించుసౌమిత్రిదో
స్థానాగ్రోజ్ఝితరుక్మపుంఖకషణోద్భూతస్ఫులింగచ్ఛటా

క్షీణజ్వాలధురీణబాణములు వర్షింపంగ నీవేల స
ప్రాణత్రాణశరీరు లై నిలుతురే బ్రహ్మాదులుం ముందటన్.

మ. తురగస్యందనమత్తవారణభటస్తోమంబుతోఁ గూడ నీ
పురి భస్మంబుగఁ గాల్చి సైనికసుహృత్పుత్రానుజశ్రేణి నె
త్తురు గ్రక్కం బడ గ్రుద్ది చంపి మఱిమృత్యుక్రూరతంబట్టినీ
శిరముల్ ద్రుంపఁగ నేన చాలుదు జయశ్రీలబ్ధి వర్ధిల్లఁగన్.

క. సుగ్రీవాదులయెదుట ను
దగ్రగతిం నిన్నుఁ ద్రుంతు ననురఘుకులవీ
రాగ్రణిప్రతిజ్ఞకతన ద
శగ్రీవుఁడ బ్రతికి తీవు చావక నాచేన్. 5

ఆ. అజునివరము నీకు నమరగంధర్వాసు
రాహియక్షరాక్షసాలిచేత
మడియకుండఁ గాని మనుజవానరులచేఁ
గలనఁ జావకుండఁ గాదు వినుము. 6

క. ఘనుఁ డగురాముఁడు మనుజుం
డినజుఁడు వానరుఁడు గాన నియ్యిరువురచే
ననిఁ జావంగలవాఁడవు
మనమున నామాట నమ్మి మతకరి వగుచున్. 7

శా. నీకంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
కౌకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగతమృత్యువా జనకకన్యం వేగయొప్పించి లో
కైకత్రాణుని రామునిం గనుము నీ కీబుద్ధి గా కుండినన్.

క. సీతారాములకోప
స్ఫీతానలశిఖలు గలయఁ బేర్చుచు లంకా

భూతవ్రాతము భస్మీ
భూతముగాఁ జేయు ననుడుఁ బొడమినకిన్కన్. 9

మ. కుటిలభ్రూకుటిభీమఫాలదశకక్రూరోరునాసాపుటో
ద్భటలంబోష్ఠహనుప్రకంపననటద్దంష్ట్రాతిఘోరాస్యుఁడై
పటుదృష్టిస్ఫుటవిస్ఫులింగములు పైపైఁ గ్రమ్మ నీకష్టమ
ర్కటునింజంపుఁడునావిభీషణుఁడుధర్మంబొప్పలంకేశుతోన్.

శా. ఈకోపంబున కగ్ని యో వరుణుఁడో యీశానుఁడో వాయు
వో, నాకాధీశుఁడో యక్షనాయకుఁడో కీనాశుండో కోణే
శుఁడో, యీకీశాధముఁ డెంతవాఁడరయ వీఁ డిట్లొగ్గ
లేమాడినన్,నీకున్ వధ్యుఁడుగాఁడు సైఁపుమదిలో నీవింక
లంకేశ్వరా. 11

క. దూతకు వధకంటెఁ గశా
ఘాతము ముండనము నంగకర్తన మంకం
బాతతదండము లెందును
దూత యవధ్యుఁ డని చెప్పుదురు ధర్మవిదుల్. 12

వ. అని పల్క రావణుండు విభీషణునిపల్కు లాదరించి. 13

క. తరుచరునకు వాలము ప్రియ
కర మగుటను వీనితోఁకఁ గాలిచి నక్తం
చరు లందఱుఁ జూడఁగ నీ
పుర మంతయుఁ గలయఁ ద్రిప్పిపుచ్చుం డనినన్. 14

వ. ఉద్ధతి రణకర్కశు లగురక్కసు లక్కపీంద్రుం గవిసి. 15

———

# శ్రీమదాంధ్ర భాగవతము

## సప్తమస్కంధము.

---

### ప్రహ్లాదచరిత్రము.

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికై వడిఁ
జేరి నమస్కృతుల్ చేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన
మాతృభావము చేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు

తే. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు
దైవతములందు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁ డైనప్రహ్లాదుఁ డధిప.

వ. మఱియును.

సీ. ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుఁ డై
గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు
వివిధమహానేకవిషయసంపన్నుఁ డై
పంచేంద్రియములచేఁ బట్టువడఁడు

భవ్యవయోబలప్రాభవోపేతుఁ డై
కామరోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీప్రముఖభోగము లెన్ని గలిగిన
వ్యసనసంసక్తి నావంకఁ బోఁడు

ఆ. విశ్వమందుఁ గన్నవిన్న యర్థములందు
వస్తుదృష్టిఁజేసి వాంఛ యిడఁడు
ధరణినాథ దైత్యతనయుండు హరిపర
తంత్రుఁ డై హతాన్యతంత్రుఁ డగుచు. 3

ఆ. సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి
యసురరాజతనయునందు నిలిచి
పాసి చనవు విష్ణుఁ బాయనివిధమున
నేఁడుఁ దగిలి యుండు నిర్మలాత్మ. 4

మ. పగవారైనసురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాదసంకాశులన్
సుగుణోపేతుల నెందు నే మెఱుఁగ మంచున్ వృత్తబం
ధంబులం, బొగడం జొత్తురు సత్కవీంద్రుల క్రియన్ భూనా
థ మిూబోఁటిస, ద్భగవద్భక్తులు దైత్యరాజతనయుం బా
టించి కీర్తింపరే. 5

క. గుణనిధి యగుప్రహ్లాదుని
గుణము లనేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు
ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్. 6

వ. ఇట్టు సద్గుణగరిష్ఠుం డయిన ప్రహ్లాదుండు భగవంతుం
డయిన వాసుదేవునియందు సహజసంవర్ధమాన నిరంతర
ధ్యానరతుం డై. 7

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరినయట్టైనఁ
జెలికాండ్ర నెవ్వరిఁ జేరఁ మఱచు
నసురారి దనమ్రోల నాడినయట్టైన
నసురబాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్టైనఁ
బరభాషలకు మాఱుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్టైనఁ
జూక్కి సమస్తంబుఁ జూడ మఱచు
తే. హరిపదాంభోజయుగచింతనామృతమున
నంతరంగంబు నిండినయట్టైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి
జడతలేకయు నుండును జడునిభంగి. [శ్రీ

శా. పానీయంబులుద్రావుచుం గుడుచుచుఁ భాషించుచుఁ హాస
లానిద్రాదులు సేయుచుం దిరుగుచుఁ లక్షించుచుఁ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం
ధానుండై మఱచెఁ సురారిసుతుఁ డేతద్విశ్వముఁ భూవరా.

సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁ డై
యుద్ధతుఁ డై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియ కాని వేఱొండు లే దని
యొత్తిలి నగుచుండు నొక్కచోట

నలినాక్షుఁ డనునిధానముఁ గంటి నే నని
యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ
ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్ష జనితబాష్పసలిల
మిళితపులకుఁ డై నిమీలితనేత్రుఁ డై
యొక్కచోట నిలిచి యూర కుండు. 10

వ. ఇట్లు పూర్వజన్మపరమభాగవతసంసర్గసమాగతం బైనముకుందచరణారవిందసేవాతిరేకంబుననఖర్వనిర్వాణభావంబు విస్తరించుచు నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు చేయుచు నప్రమత్తుండును సంసారనివృత్తుండును బుధజనవిధేయుం డును మహాభాగధేయుండును సుగుణమణిగణగరిష్ఠుం డును బరమభాగవతశ్రేష్ఠుండును గర్మబంధలతాలవిత్రుం డును బవిత్రుండును నైనపుత్రునియందు విరోధించి సుర విరోధి యనుకంప లేక చంపం బంపె నని పలికిన నారదు నకు ధర్మజుం డి ట్లనియె. 11

శా. పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధి చెప్పి దురితోన్మేషంబె వారింతు రే
శత్రుత్వంబుఁ దలంప రిట్టియెడ నాసౌజన్యరత్నాకరుం
బుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి నెగులుం బొందింప నెట్లోర్చెనో.

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహచింతనక్రియా
లోలుఁ గృపాళు సాధుగురులోకపదానతఫాలు నిర్మల
శ్రీలు సమస్తసభ్యనుతశీలు విఖండితమోహవల్లికా
జాలు నదేల తండ్రి వడిఁ జంపఁగఁ బంపె మునీంద్ర చెప్పవే.

వ. అనిన నారదుం డి ట్లనియె. 14

శా. లభ్యం బైనసురాధిరాజపదమున్ లక్షింపఁ దశ్రాంతమున్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై జాడ్యంబుతో వీఁడువి
ద్యాభ్యాసంబునఁగాని తీవ్రమతిగాఁ డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతున్ వీక్షించిసోత్కంఠుఁడై.

క. చదువనివాఁ డజ్ఞుం డగుఁ
జదివిన సదసద్వివేకచతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ. 16

వ. అని పలికి యసురలోకపురోహితుండును భగవంతుండును
నయిన శుక్రాచార్యకొడుకులఁ బ్రచండవితర్కులఁ జండా
మర్కుల రావించి సత్కరించి యిట్లనియె. 17

శా. అంధప్రక్రియ నున్నవాఁడుపలుకం డస్మత్ప్రతాపక్రియా
గంధం బించుక లేదుమీరుగురువుల్ కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలుమముం బాటించియీ బా
లకున్, గ్రంథంబుల్ చదివించినీతికుశలుంగావించిరక్షింపరే.

వ. అని పలికి వారలకుఁ బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొం
డనిన వారును దనుజరాజకుమారునిం గొనిపోయి యతనికి
సవయస్కులగుసహశ్రోతలనసురకుమారులంగొందఱంగూర్చి.

ఉ. అంచితభక్తితోడ దనుజాధిపుగేహసమీపముం బ్రవే
శించి సురారిరాజసుతుఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం
పించిరి పాఠయోగ్యములు పెక్కులుశాస్త్రములాకుమారుఁ
డాలించి పఠించెనన్నియుఁ జలింపనివైష్ణవభక్తిపూర్ణుఁడై.

క. ఏపగిది వారు చెప్పిన
నాపగిదిం జదువుగాని యట్టిట్టని యా
క్షేపింపఁడు తా నన్నియు
రూపించిన మిథ్య లని నిరూఢమనీషన్. 21

శా. అంతం గొన్ని దినంబు లేగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుం డై నిజనందనుఁ గురువు లేజాడం బఠింపించిరో
భ్రాంతుం డేమి పఠించెనో పిలిచి సంభాషించి విద్యాపరి
శ్రాంతిం జూచెదఁ గాక నేఁడని మహాసౌధాంతరాసీనుఁడై.

ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మనిచీరఁబంచెఁబ్ర
హ్లాదకుమారకుఁ భవమహార్ణవతారకుఁ గామరోషలో
భాదివిరోధివర్గపరిహారకుఁ గేశవచింతనామృతా
స్వాదకఠోరకుం గలుషజాలమహోగ్రవనీకుఠారకున్. 23

వ. ఇట్లు చారులచేత నాహూయమానుం డై ప్రహ్లాదుండు
చనుదెంచిన. 24

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమే యుద్యోగమారూఢసం
విత్సంపన్నుఁడ వైతివే చదివితే వేదంబులుఁ శాస్త్రముల్
వత్సా రమ్మని చేరఁ జీరి కొడుకుఁ వాత్సల్యసంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుండుత్కంఠదీపింపఁగన్.

క. అనుదినసంతోషణములు
జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
తనయులసంభాషణములు
జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్. 26

వ. అని మఱియుఁ బుత్రా నీ కెయ్యది భద్రం బై యున్నయది
చెప్పు మనినఁ గన్నతండ్రికిఁ బ్రియనందనుం డి ట్లనియె.

ఉ. ఎల్లశరీరధారులకు ని ల్లనుచీఁకటినూతిలోపలం
ద్రెళ్లక వీరు నే మనుమతిభ్రమణంబున భిన్ను లై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతనిదివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ.
వ. అని కుమారుం డాడినప్రతిపక్షానురూపంబు లయిన సల్లా
పంబులు విని దానవేంద్రుండు నగుచు ని ట్లనియె. 29
క. ఎ ట్టాడిన నట్టాడుదు
రిట్టి ట్టని పలుక నెఱుఁగ రితపల శిశువుల్
దట్టించి యెవ్వ రే మని
పట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్. 30
శా. నాకుం జూడఁగఁ జోద్య మయ్యెడిఁ గదా నాతండ్రి యీ
బుద్ధిదా, నీకుఁ లోపలఁ దోఁచెనో పరులు దుర్నీతుల్ పఠిం
పించిరో, యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీదానవశ్రే
ణికిన్, వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కే
టికిన్. 31
మ. సురలం దోలుటయో సురాధిపతులన్ స్రుక్కించుటో సిద్ధు
లం, బరివేధించుటయో మునిప్రవరులన్ బాధించుటో య
క్షకిన్నరగంధర్వవిహంగనాగపతులన్ నాశంబు నొందిం
చుటో, హరి యంచున్ గిరి యంచు నేల చెడ మోహాం
ధుండ వై పుత్రకా. 32
వ. అనినఁ దండ్రిమాటలకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం
డి ట్లనియె. మోహనిర్మూలనంబు చేసి యెవ్వనియందుఁ
దత్పరు లయి యెఱుక గలపురుషులకుం బరులు దా మని
యెడుమాయాకృతం బయినయనర్థాహ్యాం బగుభేదంబు
గానంబడ దట్టి పరమేశ్వరునకు నమస్కరించెద. 33

శా. అజ్ఞుల్ గొందఱు నేము దా మనుచు మాయం జెంది సర్వా
త్మకుం, బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమములన్ భాషింపఁగా
నేరరా,జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మా
దివే,దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ వర్ణింపఁగా నేర్తురే.

తే. ఇను మయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశుసన్నిధి నావిధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు. 35

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు పోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం
బరుఁగునే సాంద్రనీహారములకు

తే. నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు
వినుతగుణశీల మాటలు వేయు నేల 36

వ. అనిన విని రోషించి రాజసేవకుం డైనపురోహితుండు
ప్రహ్లాదుం జూచి తిరస్కరించి యిట్లనియె. 37

ఉ. పంచశరద్వయస్కుఁడవు బాలుఁడ వించుక గాని లేవు భా
షించెదుతర్కవాక్యములు చెప్పినశాస్త్రములోనియర్థ మొ
క్కించుకయైనఁజెప్ప వసురేంద్రునిముందటమాకునాదలల్
వంచుకొనంగఁ జేసితివి వైరివిభూషణ వంశదూషణా. 38

చ. తనయుఁడుగాఁడుశాత్రవుఁడుదానవభర్తకువీఁడు దైత్యచం
దనవనమందుఁ గంటకయుతక్షితిజాతముభంగిఁ బుట్టినాఁ
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి చేయుచుండుదం
డనమునఁ గాని శిక్షలకు డాయఁడుపట్టుఁడుకొట్టుఁడుద్ధతిన్.

క. ఈపాపనిఁ జదివింతుము
నీపాదము లాన యింక నిపుణతతోడం
గోపింతుము దండింతుము
కోపింపకు మయ్య దనుజకుంజర వింటే. 40

వ. అని మఱియు నారాచపాపనికి వివిధోపాయంబులం బురో
హితుండు వెఱపుఁజూపుచు రాజసన్నిధిం బాపి తోడు
కొని పోయి యేకాంతంబున. 41

క. భార్గవనందనుఁ డాతని
మార్గము చెడ కుండఁ బెక్కుమాఱులు నిచ్చల్
వర్గత్రితయము చెప్పె న
నర్గళ మగుమతివిశేష మమర నరేంద్రా. 42

వ. మఱియు గురుండు శిష్యునకు సామదానభేదదండోపా
యంబు లన్నియు నెఱింగించి నీతికోవిదుం డయ్యె నని నమ్మి
నిశ్చయించి తల్లికి నెఱింగించి తల్లిచేత నలంకృతుం డయిన
కులదీపకు నవలోకించి. 43

ఉ. త్రిప్పకు మన్న మామతము దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకు మన్న నేఁడుమన దైత్యవరేణ్యుని మ్రోల నేము మున్
జెప్పిననీతి గాని మఱి చెప్పకు మన్న విరోధినీతులన్
విప్పకు మన్న దుష్టమగు విష్ణుచరిత్రకథార్థజాలముల్. 44

వ. అని బుజ్జగించి దానవేశ్వరుసన్నిధికిం దోడి తెచ్చిన. 45

సీ. అడుగడ్డునకు మాధవానుచింతనసుధా
మాధుర్యమున మేను మఱచువాని
నంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని
హరిభక్తి పుంభావ మైనవాని
మాతృగర్భము చొచ్చి మన్నది మొదలుగాఁ
జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని
నంకించి తనలోన నఖిలప్రపంచము
శ్రీవిష్ణుమయ మని చెలఁగువాని

తే. వినయకారుణ్యబుద్ధివివేకలక్ష
ణాదిగుణముల కాటపట్టయినవాని
శిష్యు బుధలోకసంభావ్యుఁ జీరి గురుఁడు
ముందటికిఁ ద్రొబ్బెఁ దండ్రికి మ్రొక్కు మనుచు. 46

క. శిక్షించితి మన్యము లగు
పక్షంబులు మాని నీతిపారగుఁ డయ్యెన్
రక్షోవంశాధీశ్వర
వీక్షింపుము నీకుమారువిద్యాబలమున్. 47

వ. అని పలికిన శుక్రకుమారకువచనంబు లాకర్ణించి దానవేం
ద్రుండు దనకు దండప్రణామంబు చేసి నిలుచున్న కొడుకును

దీవించి బాహుదండంబు సాఁచి దిగ్గనఁ బగ్గలిం దిగిచి
గాఢాలింగనంబు చేసి తనతొడలమీఁద నిడుకొని చుంచు
దువ్వి చుబుకంబుఁ బుడికి చెక్కిలి ముద్దుగొని శిరంబు
మూర్కొని ప్రేమాతిరేకసంజనితబాష్పసలిలబిందుసందో
హంబుల నతనివదనారవిందంబు దడుపుచు మందమధురా
లాపంబుల ని ట్లనియె. 48

శా. చోద్యంబయ్యెడినింతకాలమరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు చెప్పిరో గురువు లేవెంటంబఠింపించిరో
విద్యాసార మెఱుంగఁ గోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యంబొక్కటి చెప్పిసార్థముగఁదాత్పర్యంబు భాషింపుమా.

శా. నిన్నున్ మెచ్చరు నీతిపాఠమహిమన్ నీతోడి దైత్యార్భకుల్
గన్నా రన్నియుఁజెప్ప నేర్తురుగదా గ్రంథార్థముల్ పెక్కులై
యున్నా యెన్నఁడునీవునీతివిదుఁడౌ దంచున్ మహావాంఛతో
నున్నాఁడన్ ననుఁగన్నతండ్రి భవదీయోత్కర్షముంజూపవే.

వ. అనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుం డయినప్రహ్లాదుం డి
ట్లనియె. 51

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మ మెల్లఁ జదివితిఁ దండ్రీ. 52

మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్
వందనా,ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీ
ర్తనల్ చింతనం,బను నీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్

హరిఁ నమ్మి సజ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతుఁ
సత్యంబు దైత్యోత్తమా. 53

శా. అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ గృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితులరిక్తవ్యర్థసంసారముల్. 54

సీ. కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచుచూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణు నాకర్ణించువీనులు వీనులు
మధువైరిఁ దవిలినమనము మనము
భగవంతు వలగొనుపదములు పదములు
పురుషోత్తమునిమీఁదిబుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించుదినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించుచదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు
తండ్రిహరిఁ జేరుమనియెడితండ్రి తండ్రి. 55

సీ. కంజాక్షునకుఁ గానికాయంబు కాయమే
పవనగుంఫితచర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడనివక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడిఢక్క గాక

హరిపూజనము లేనిహస్తంబు హస్తమే
తరుశాఖనిర్మితదర్వి గాక
కమలేశుఁ జూడనికన్నులు కన్నులే
తనుకుడ్యజాలరంధ్రములు గాక
ఆ. చక్రిచింత లేనిజన్మంబు జన్మమే
తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేనివిబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడిపశువు గాక. 56

---

శ్రీ ర స్తు.

# శ్రీమదాంధ్ర వచనభారతము

## ఆరణ్యపర్వము - ద్వితీయాశ్వాసము.



### అగస్త్యుఁడు వాతాపియనుదానవుని జీర్ణింపఁజేయుట

ఇల్వలుండు నెదురేగి వారలఁ దనవీడు సేర్చి యందఱ నాతిథ్యంబునకుఁ బ్రార్థించి యెప్పటియట్ల మేషరూపధారి యయినవాతాపిని వధించి తన్మాంసంబు వండుచుండె. ఆసడి యెఱింగి యారాజులు సంభ్రమంబు గదుర నద్దానవాధముని దురుద్యోగంబుఁ దేటపఱుప నగస్త్యుఁ డింతకు విషాదంబు వలదు వానిం గబళింతు ననిబోధించి యారాజుల నూఱార్చె. ఇల్వలోపకల్పితం బయినయాసనంబునఁ గూర్చుండి వానివడ్డించినవాతాపినంజు డంతయు మెల్లన నమలి యొక్కత్రేఁపు త్రేఁచె. అట నిల్వలుం డెప్పటియట్ల వాతాపీ ! వెడలిరమ్మని పలుమాఱులు పిల్వఁగ నగస్త్యుండు నవ్వుచు నోయిల్వలా ! యింకను వాతాపి గలఁడే ? వాఁడు నాజఠరంబున జీర్ణుఁడయ్యెననిన విషణ్ణుండై యిల్వలుండు కేల్దోయి మొగిచి మునిపుంగవా! యేల వీరితోడ వచ్చితిరనిన నగస్త్యుం డసురపతీ! నీ వెల్లవారికంటె ధనికుఁడ వని విని ధనార్థులమై వచ్చినవారము. నీపోష్యజనపోషణంబునకు విఘాతంబు గాదేని యీ రాజులకుఁ బ్రత్యేకంబ పదివేలమొదవుల, నన్ని గద్యాణంబులను నా కిరువదివేలమొదవుల, నన్ని గద్యాణంబులను, మనోవేగంబులయిన యుత్తమాశ్వంబులం బూన్చినయొకసువర్ణరథంబును విచారించి యిమ్మని చెప్పిన నిల్వలుండు తత్క్షణంబ వాని నెల్లఁ దలంచి తెప్పించి మునిచెప్పినట్ల యారాజులకంతయు నొసంగి యతనికి విరావ సురావంబు లనుగుఱ్ఱములం బూన్చినకాం

చనరథంబు, నిరువదివేలమొదవుల, నన్ని గద్యాణంబుల నొసంగె. వానిం గైకొని యగస్త్యుం డారథంబు నారాజులతోడ నారోహించి యతివేగంబున నాశ్రమంబు సేరి యారాజులం దత్తత్పురంబులకుం బోననుజ్ఞ చేసి పత్నికోరిన ప్రకారంబు నన్నియుం గల్పింప నాలోపాముద్ర యెంతయు సంతోషించి యింక నపత్యోత్పాదనంబుం గావింపు మనిన నగస్త్యుం డిట్లనియె. కల్యాణీ! నీవృత్తంబునం జేసి సంతుష్టుండ నైతి. వేవురం గొడుకులం గోరికొనియెదవో, పదుగురం బోలెడువారల నూఱుగుర నపేక్షింతువో, నూఱుగురం బోలెడువారలం బదుగుర వలతో, వేవురం బోలెడు వాని నొక్కనిం గాంక్షింతువో యని యడుగ లోపాముద్ర పెక్కండ్రకంటె వేవురం బోలెడివాని నొక్కనిం బ్రసాదింపుము. ఒక్కరుండైన సర్వగుణవిలసితుండు గావలయుం గాని యప్రయోజకులు పలువు రేల? యని చెప్పినం దదభిప్రాయం బెఱింగి యగస్త్యుండు శుభసమయంబునం జిత్తానువర్తి యగు నాలోపాముద్రకు గర్భాధానంబుం గావించి తపోనుష్ఠానార్థంబు వనమునకుం జనియె. అట లోపాముద్ర యేడేఁడులు గర్భంబుం దాల్చె. అంత నెనిమిదవయేఁట గర్భస్థుం డగుకుమారుండు సాంగవేదములం జదువుచు దృఢస్యుం డనం బరంగె. అమ్మునికిం దేజస్వియనువాఁడు పుట్టి చిఱుతప్రాయమునం దె యగ్నిపరిచర్యార్థంబుగ నిధ్మంబులం దెచ్చుటం జేసి యిధ్మవాహుండునాం బరంగె. ఇవ్విధంబున నగస్త్యసంతానంబు పుత్రపౌత్రాభివృద్ధిం బొందుటయుం దత్పితృదేవత లుత్తమలోకంబులం గాంచిరి. నాఁటంగోలె నియ్యాశ్రమం బగస్త్యాశ్రమం బన విశ్రుతం బయ్యె. ఇది భాగీరథి. తల్లివలె నీదక్షిణదిక్కు నెల్లం బవిత్రీకరించునది. ఇందు మునుంగుము. ఇది భృగుతీర్థంబు. ఇందుం బరశురాముండు తొల్లి శ్రీరామాపహృతం బైనతనతేజంబుం గ్రమ్మఱ నధిగమించె. నీవు నిందుం దమ్ములతోడను, ద్రౌపదితోడను స్నానముం గావించిన దుర్యోధనాపహృతం బైనరాజ్యంబుం గ్రమ్మఱ సాధింతు వని రోమశుండు నిరూపించిన ధర్మరాజుండు సానుజుండు సభార్యుండుగ

స్నాన మొనరించి దేవపితృతర్పణం బొనరించి యప్రధృష్యతేజంబుఁ బడసి రోమశుం జూచి మునిపుంగవా! పరశురాముని తేజంబును శ్రీరాముఁ డేల యపహరించె. క్రమ్మఱ నతఁడెట్లు దానిఁ బొందె నని యడుగ నమ్ముని యతని కిట్లనియె.

నారాయణుండు రావణవధార్థంబుగ దశరథపుత్త్రుఁడుగ నవతరించె ననుట సుప్రసిద్ధంబు గదా. ఆశ్రీరామునిపరాక్రమంబు నెఱుంగఁ బరశురాముఁడు తనవిల్లుఁగొని యయోధ్యకుఁబోవుటయు దశరథుఁడు జామదగ్న్యుని దమదేశముఁ జొచ్చిన వానిఁగ నెఱింగి రాముం బంపె. పరశురాముఁడును దాశరథిం జూచి నవ్వుచు రాజేంద్రా! నీబలంబు చూతము. ఈవిలు మోపెట్టు మని దర్పంబునం బలికిన దాశరథి యీమాటల నేమి ప్రయోజనంబు? ఇదె చూడు మని చెప్పి తత్క్షణంబ పరశురామునిచేతివిల్లు గొని యశ్రమంబున మోపెట్టి సకలభూతంబు లుద్విగ్నంబులుగాఁగ గొన యమ్ము సారింపుచు నిఁక నేమి చేయవలయు నని యడిగె. అడుగుటయుఁ బరశురాముఁడు రాముం జూచి యోహో! మోపెట్టినమాత్రన వీర్యవంతుఁడ వైతివో? ఈ యమ్ము నందు సంధింపుము. ఇందుఁ జూతము నీబలం బని చెప్పి యొకబాణ మిచ్చిన శ్రీరాముఁడు దాని వేగంబ సంధించి కోపదీపితుండై జామదగ్న్య! బ్రాహ్మణులు క్షమావంతు లని లోకవిశ్రుతంబు. నీయందు శాంతియన్న సున్న. తేజ మొక్కండు క్షత్త్రియులకంటె నెక్కుడుగఁ బూని యుండెదవు. బ్రహ్మప్రసాదంబున నన్నధిక్షేపించి పలికెదవు. వృథా గర్వం బుడుగుము. దివ్యదృష్టి నొసంగెద నన్నుఁ జూడు మనియె. అనవుడు నాదివ్యదృష్టిప్రభావంబునఁ బరశురాముఁడు శ్రీరామునిశరీరంబున వసురుద్రాదిత్య సిద్ధసాధ్యదైత్యదానవ యక్షరాక్షసగుహ్యకగంధర్వ పితృమరుద్గణంబుల, గ్రహనక్షత్త్రముల, నగ్నుల, వాలఖిల్యాదిబుషుల, దేవర్షుల, సముద్రముల, సకలనదుల, నిఖిలపర్వతముల, సర్వతీర్థముల, మూర్తిమంతంబు లయిన సర్వవేదవేదాంతయజ్ఞవషట్కారంబుల, మేఘబృందములనుం గాంచి

భయవిస్మయభ్రాంతస్వాంతుండై యుండ శ్రీరాముఁ డాబాణము నత నిపైఁ బ్రయోగించె. ప్రయోగింపఁగ నది పాంసువర్షంబును, ఝంఝా వాతంబును, గొఱవులను నంతటం బఱపించుచుఁ బుడమి వడఁక నాజామ దగ్న్యని తేజంబు గ్రహించి చనియె. జామదగ్న్యుఁడు నయ్యస్త్రంబు సోఁక మూర్ఛవోయి కొంతవడికి లబ్ధచేతనుండై లజ్జాభయంబులు పెనంగొ నఁగ శ్రీరామునకుఁ గృతప్రణాముఁడై యనుజ్ఞఁ గొని మహేంద్రపర్వ తంబుఁ జేరె. అంత నొక్కవర్షంబు చన నతనిపితరులు మదం బుడిగి దుఃఖింపుచున్న యాపరశురాముపాలికి వచ్చి పుత్రా! సర్వలోకేశ్వరుం డైన విష్ణు నెదిరించుటంబట్టి యిట్లు నిస్తేజస్కుఁడ వైతివి. సర్వలోకపూజ్యుం డైన యమ్మహానుభావుఁ జెనకవచ్చునే? వధూసర యనునదికిఁ జనియందు దీప్తోదం బనుతీర్థంబాడుము. అందే భవత్ప్రపితామహుఁ డైనభృగుమహర్షి తీవ్ర తపంబు సలిపె. తొల్లింటితేజంబుఁ బొందఁగల వని బోధించిరి. వారి వచనం బునఁ బరశురాముఁడు తొల్లి యాతీర్థంబునాడి నిజతేజం బధిగమించె ననిన విని ధర్మరాజు రోమశమునీంద్రా! యగస్త్యచరితంబు సవిస్తరంబుగఁ జెప్ప వేయని యడుగుటయు నమ్ముని యతని కిట్లనియె.

## ఇంద్రుఁడు వజ్రాయుధమున వృత్రాసురుం జంపుట.

ధర్మనందనా! యుద్ధదుర్మదులు, పరమదారుణులు నగుకాలకేయు లనురాక్షసులు వృత్రాసురునాశ్రయించి నానావిధాయుధంబులంబూని సుర లకు వివిధబాధలఁ గావింప నమరులు తత్పరాక్రమంబు నివారింప నేరక యింద్రపురస్కృతులై బ్రహ్మపాలికిఁ జని కృతాంజలు లగుటయుఁ బర మేష్ఠి వారిమనోభిప్రాయం బెఱింగి సురలారా! మీతలంపు నే నెఱుంగుదు. దధీచమునీంద్రునొద్దకుఁ బోయి యతనియెమ్ములఁ బ్రార్థించుఁడు. అతండు భవత్ప్రార్థనంబు వృథ పుచ్చఁడు. ఆయస్థులఁ దీసికొని వజ్రాయుధంబుఁ జేయించుఁడు. అద్దివ్యసాధనంబున నింద్రుఁడు వృత్రాసురుం జంపు. ఈయు పాయంబు శీఘ్రంబ చేయుఁ డనియె. సురలును బ్రహ్మయానతిం గొని

నారాయణపురస్కృతులై సంతతక్రూరమృగప్రచారంబు, సామగానానుకారిమధుకరమధురఝంకారసమంచితంబు, నానాద్రుమలతావితానంబునై భయానకమహనీయరమణీయంబై యున్నదధీచాశ్రమంబునకుఁ జని తపోమహిమంబున నరుణకిరణుకరణిఁ దేజరిల్లుచున్న యమ్మునిం గాంచి బ్రహ్మచెప్పిన ప్రకారంబునఁ బ్రార్థించిరి. తత్ప్రార్థనంబు విని దధీచముని యతిప్రీతుండై సురలకు హితంబుచేయుటకంటె నుత్తమంబు వేఱొండు గలదే. అవశ్యంబు నాదేహంబు నిత్తునని చెప్పి యోగవిద్యామహిమంబునఁ బ్రాణముల విడిచె. అంత సంతుష్టులై నిలింపు లమ్మునియెమ్ముల గ్రహించి విశ్వకర్మచే వజ్రాయుధంబుఁ గావించి కాలకేయగణపరివృతుం డైనవృత్రాసురుని దాఁకుటయు దేవదానవులకుఁ బోరు ఘోరంబయ్యె. అట్టియెడ నప్పటప్పటికి వృత్రునకు బలం బధిక మగుటయు నింద్రుఁడు క్షీణబలుం డగుటయుఁ బరికించి నారాయణుండు తన తేజోమహిమంబున నింద్రునకుఁ దేజోవృద్ధిఁ గావించుటయు నమ్మహేంద్రుఁడు మహర్షులకు మహానందంబు గూరఁ బోరు సేయుచుండ వృత్రుఁడు ఘోరరూపంబుగా సింహనాదంబు లొనరించె. ఆఘోరనిస్వనంబునకుఁ బుడమి వడఁకె. దిక్కు లదరె. నభంబు చలించె. అంత నెంతయు సంత్రస్తుండై యాఖండలుండు వజ్రాయుధంబు వానిపై నేసె. ఏయుటయు వృత్రుఁడు పర్వతంబుమాడ్కిఁ బుడమి యద్రువఁ గ్రిందఁ గూలె. అమ్మహాసంభ్రమంబున నిది యెట్టి దని నిరూపింప నేరక దిక్కు దోఁచక యింద్రుఁ డెద్దియేనికొలను సొరఁగఁ గాందిశీకుఁడై కొంతవడికి వృత్రవధంబుఁ దెలిసి క్రమ్మఱ వచ్చి సురలం బురికొల్పి కాలకేయులఁ జెండాడం దొడంగుటయు నాదానవులు విభ్రాంతులై పాఱి సముద్రంబుఁ జొచ్చిరి. చొచ్చి యాకాలకేయు లంతనిలువక త్రైలోక్యవినాశార్థం బుద్యమించి తమలో మంతనంబు సేయువారు ముందుగ విద్యాతపోవిలసితు లగుబ్రాహ్మణుల వధింతము. వీరు పోయిన జగంబు నశించు. మనము పెఱవారికి దురాధర్షం బయినసముద్రంబు దుర్గంబుగా నాశ్రయించితి మనివిచారింప "వినా

శకాలే విపరీతబుద్ధి” యనున్యాయమున బ్రాహ్మణుల వధింప నిశ్చయించిరి. అట్లు కృతనిశ్చయులై యాదానవులు పగలెల్ల సముద్రమున డాఁగి రాత్రు లెల్ల మునిపల్లెలకుఁ బోవుచు బ్రాహ్మణుల వధింపు చుండిరి. ఆవిప్రప్రళయంబున వసిష్ఠాశ్రమమున నూటతొంబదియేఁడ్గురును, చ్యవనాశ్రమంబున నూఱుగురును, భరద్వాజాశ్రమంబున నిరువదుగురును, నింకను ననేకాశ్రమంబులందుఁ బెక్కండ్రును మహామును లాదుష్టరాక్షసులవలనఁ బొలియుటయు భూమియంతయు బ్రాహ్మణులకండలతండంబులను, నెత్తురుటేరులను, బ్రేవులప్రోవులను, భగ్నంబు లయినకమండలువులను, బగులఁ గొట్టినస్రుక్స్రువంబులను, వికీర్ణంబు లయిన యగ్నిహోత్రంబులను నీరంధ్రంబయ్యె. వేదాధ్యయనంబు, యజ్ఞాచరణంబు, తపోనుష్ఠానంబును గథాశేషంబు లయ్యె. అందఱు ప్రాణరక్షణపరాయణులై దోఁచినట్ల పాఱిరి. శూరులు కొందఱు తద్వధార్థం బాయుధపాణులై యంతటను వెమకి సముద్రదుర్గవాసు లగువారలఁ గాంచ నేరరయిరి.

## దేవతలు విష్ణుదేవుని స్తుతించుట.

అంత వేదాధ్యయనయజ్ఞాచరణాదిసత్క్రియాకలాపలోపంబున లోకమునకు వినాశ మాసన్న మగుడు వెఱచి వేల్పులు సేంద్రులై శరణత్రాణపరాయణుం డైననారాయణుపాలికిఁ జని నమస్కరించి దేవా! నీవలన జగంబులు పుట్టుఁ బెరుగు నడఁగు. నీవ సకలకారణంబవు. సర్వంబు నీయందసుప్రతిష్ఠితంబు. నీవ తొల్లి వరాహరూపధరుండవై భూమి నుద్ధరించితివి. నరసింహరూపధరుండవై హిరణ్యకశిపుని సంహరించితివి. వామనరూపధరుండవై బలిని త్రైలోక్యరాజ్యవిభ్రష్టుం జేసితివి. యజ్ఞధ్వంసకుఁ డైనజంభుఁ డనుదానవు వధించితివి. నీకృత్యంబుల లెక్కింప మాబోంట్ల కలవియే? భయభ్రాంతుల మైనమాకు నీవే గతివి. వేఱొక్కదిక్కుఁ గానము. కాలకేయులవలనఁ గలిగినయుపద్రవము నివారించి లోకములను, మమ్మును రక్షింపుము. ఆదురాత్ములు పవలెల్ల నగపడరు. రేలెల్ల గండుమీఱి బ్రాహ్మణుల

వధించుచున్నవారు. బ్రాహ్మణులు క్షయించిన భూలోకంబు నశించు. భూలోకంబు నశించిన స్వర్గము చెడు. బ్రాహ్మణక్షయంబ యిట్లు సర్వనాశంబునకు మూలంబయ్యెడి. కరుణింపుము. నీప్రసాదంబునం గాదే సర్వభూతంబులు పెరుగుచున్నయవి. సర్వభూతవృద్ధిచేతఁ గదా హవ్యకవ్యముల మేము దనియుదుము. అస్మదీయప్రత్యవేక్షణంబునంగాదె భూలోకమున మేలుగలుగు. కావున లోకంబు లన్యోన్యాశ్రయంబున వృద్ధిఁగాంచుచున్నవి. భయం బుడిపి కావు మని విన్నవించిన నారాయణుం డిట్లనియె. సురలారా! ప్రజాక్షయకారణంబు నాకు విదితంబు. మీకుం జెప్పెద వినుండు. వృత్రాసురు నాశ్రయించినకాలకేయు లావృత్రు నింద్రుఁడు వజ్రాయుధంబున వధింపఁగఁ బ్రాణరక్షణార్థంబు సముద్రంబుఁ జొచ్చి వెలుపువక్క లోకక్షయార్థంబుగ ఋషుల వధింపుచున్నవారు. సముద్రు నాశ్రయించి యుండునంతకు వారల వధించుట దుష్కరంబు. సముద్రము శోషించిన వారు నిరాశ్రయులై మీకుఁ జిక్కి పోలియుదురు. సముద్రంబును శోషింపఁజేయ నగస్త్యుఁడు దక్కఁ దక్కటివా రెవ్వరు వలఁతులుగారు. కావున వేగంబ మీర గస్త్యునిఁ బ్రార్థించి సముద్రశోషణంబుఁ జేయించి యాదుష్టరాక్షసుల సంహరింపుఁ డనిన విని యమరు లద్దేవదేవునానతిం గొని యగస్త్యాశ్రమంబునకుఁ బోయి ఋషిగణసముపాస్యమానుం డైనయామైత్రావరుణి మునీంద్రుఁ గాంచి మునీంద్రా! నీవు దురభిమానచిత్తుఁ డైననహుషునకు నాకలోకభ్రంశంబుఁ గావించితివి. క్రోధప్రవృద్ధం బయిన వింధ్యపర్వతంబు వృద్ధి మాన్పి సూర్యగమనంబున కప్రతివిఘాతంబుఁ గల్పించి లోకములతమం బడంచితివి. భయగ్రస్తుల మయినమాకు నీవే శరణంబ వని స్తుతించి రనుటయు ధర్మరాజు రోమశమునీంద్రా! వింధ్య మే క్రోధంబునఁ బెరిగె? అగస్త్యుఁడు దానిపెంపు నేల యడంచె నని యడుగఁగ రోమశుఁ డతని కిట్లనియె.

తొల్లి వింధ్యపర్వతంబు సూర్యుం గాంచి యేల నీవు నిత్యంబును మేరు పర్వతంబునకే ప్రదక్షిణంబుఁ జేసెదవు. ఇఁక మీఁద నాకుఁ బ్రద

క్షీణంబు సేయు మనిన సూర్యుఁడు నే నాత్మేచ్ఛమై మేరువును వలగొనను. మఱి యిది లోకప్రచారార్థంబుగా నాకు విధినిర్మితం బయినమార్గం బని చెప్పిన వింధ్యంబు గినిసి యిట్లయ్యె నేని నే నిఁక సూర్యచంద్రులమార్గంబు నిరోధింతు నని పూని యథేచ్ఛంబుగఁ బెరుగసాగె. దాన సూర్యచంద్రాది ప్రచారంబు నిరుద్ధం బగుడు లోకముల నెల్లఁ గటికచీఁకటి కప్పుకొనఁగ జగంబున సత్క్రియాలోపంబు వాటిల్లె. అంత నమరు లగస్త్యునిపాలికిఁ బోయి మునీంద్రా! వింధ్యపర్వతంబు సేత నెఱుంగుదు గదా. దీనిని వారింప నీవుదక్కఁ దక్కటివారలు నేరరు. కరుణించి దాని పెంపు నడఁగించి లోకములఁ గావు మనిన విని యక్కుంభసంభవముని లోపాముద్రతోడ వింధ్యంబునొద్దకుఁ జనుదెంచి పర్వతోత్తమా! నే నొకకార్యంబున దక్షిణంబునకుఁ బోయెద. తెరువు విడు మని చెప్పి యత్యంతవినయంబున భూసమానం బయినయాపర్వతంబుఁ గాంచి క్రమ్మఱ నిది లేచునొక్కొ యని తలంచి నావచ్చునంతకుఁ దొలంగియె యుండు మని చెప్పి దానిం దొలఁగించి దక్షిణంబునకుఁ జనియె. ఇప్పటికి నగస్త్యుఁడు దక్షిణదిక్కు విడిచి రాఁడు. ఇది వింధ్యంబు పెరుగమికిఁ గారణంబు. అది య ట్లుండె.

## అగస్త్యుఁడు సముద్రోదకంబు పానంబు సేయుట.

ఆప్రకారంబున సురలు స్తుతింపఁగ నాకర్ణించి యగస్త్యుండు త్రిదశులారా! యేల వచ్చితిరి? ఏమి చేయవలయు నని యడుగ వారు మహాత్మా! సముద్రజలముఁ ద్రాగుము. దాన నాసముద్రంబు శోషించినఁ దద్దుర్గవాసు లగుకాలకేయు లనురాక్షసులను మేము వధింతు మనిన నామైత్రావరుణి యట్ల చేయుదునని యొడంబడి దేవమునిమనుష్యోరగయక్షగంధర్వాదిపరివృతుండై యుత్తుంగతరంగంబుల నర్తనంబుఁ జేయునదివోలె, వాయువిధూననంబునఁ జరించునదివోలె, నురుగుతెట్టల నవ్వునదివోలె నొప్పునదియుఁ దిమితిమింగిల నక్రమకరాది యాదోగణనీరంధ్రంబు నగుసముద్రంబుఁ జేర నరిగి దేవముని ముఖ్యులం గాంచి లోకహితార్థంబు నేను దీని ద్రావెద. మీపనికి సన్నద్ధుల

సొల్లు వైవఁడు. నికృతి సేయఁడు. మఱి గాండీవనిర్ముక్తము లైనవాఁడినారసములం గప్పించు. గాండీవనిర్ముక్తంబు లైనక్రూరనారాచంబులు కొండల నైనం దూఁటుచేసికొని పోవుఁగాని మగుడవు. కాలాంతకుఁడు ప్రళయప్రభంజనుఁడు మృత్యుదేవతయు బడబానలంబు నొక్కవేళ మిగిలించిన మిగిలింతురుగాని ధనంజయుఁడు శత్రుశేషము నిలుపఁడు. మీదుర్నయంబుల కొప్పి సమరంబు సేసినను వచ్చువాఁడు సవ్యసాచి యగు నేని నేను బోరాడను. విరాటుఁ డగు నేని బోరితంబునకుఁ గడంగుదు నని యాచార్యపుత్రుండు క్రోధావమానఘూర్ణమానచిత్తుండై పలికిన విని దుర్యోధనునకు గాంగేయుఁ డిట్లనియె.

## భీష్ముఁడు ద్రోణాదుల ననునయించుట.

ఆచార్యవచనం బుచితంబు. ఆచార్యపుత్రువచనంబు లెస్స. కృపాచార్యవచనంబు సంగతంబు. కర్ణుఁడు కేవలక్షాత్రధర్మంబునఁ బోరాడం దలంచు. ఆచార్యు లయినవార లెట్టిసనుయంబులనైనను సత్కారార్హులుగాని నిందార్హులు గారు. దేశకాలము లెఱింగి యుద్ధమునకుఁ దొడరుట నామతంబు. యుక్తాయుక్తవిచారంబు సేయువారు తమవారికిఁ గార్యసంకటంబులు పొసంగినం జింతిల్లకుండుదురే? సూర్యసమతేజస్కు లయినపాండవులేవురు నీకు శత్రువులై యుండ నీకు దెప్పరం బగుపట్టున నాచార్యులు పగవకుండుదురే? ధర్మవిదు లయినపెద్దలును స్వార్థంబున విమోహంబుఁ జెందుదురు. ఇందులకుఁగా నాచార్యుం దూఱవచ్చునే? నామాట నీ కింపగు నేని వారి నారాధించి ప్రసన్నులం జేసికొను మనిచెప్పి యట ద్రోణాచార్యపుత్రు వెస మొగంబై భూసురోత్తమా! కర్ణుఁడు మీకు విక్రమాటోపంబు మఱింతయెక్కువగాఁగఁ బలికినవాఁడుగాని యొండుగాదు. క్షమియింపుఁడు. పార్థుండు డగ్గఱినవాఁడు. పెద్దయు దెప్పరం బగు. ఇట్టిసమయమున మనము పరస్పరభేదముఁ బాటించి యొప్పరికించి చూడఁ జనునే?

ఆదిత్యునియెడ వెలుంగును జంద్రునియెడ శీతలకాంతియుఁ దఱుఁగనియట్లు మీయెడ నస్త్రవిద్యాచాతుర్యం బొకనాఁడైనం దఱుఁగదు. నాలుగువేదము లొక్కతలగా ధనుర్వేదం బొక్కటి యొక్కతలగాఁదలంచి బ్రహ్మాస్త్రంబు మున్నగుదివ్యాస్త్రములనెల్ల సాధించి యున్నవారు. వేదవేదాంతధనుర్వేద పురాణేతిహాసాది పరిజ్ఞానంబున జామదగ్న్యుఁడొక్కరుఁడు దక్కఁ దక్కటినాఁ డెవ్వఁడు ద్రోణాచార్యునకు సమానుఁడు గాఁడని యందఱకుం దెల్లంబు. కృపాచార్యుఁడు ధనుర్వేదవిదులలో నుత్తముఁడు. నీవును దండ్రికి సమానుఁడ వనియే యందఱుం దలంతురు. ఇట్టిమహారథు లగు మీరుండియు దుర్యోధనున కొకటి గలిగెనేని యది మీకుం గలిగినదియ కాదే? కావున నీసమయమునఁ బరస్పరభేదముఁ దలపోయక యుద్ధసన్నద్ధులమై మన మందఱముం గూడి యర్జునుం దాఁకవలయు. క్షమియింపుఁ డని చెప్పిన విని యశ్వత్థామ గాంగేయుం జూచి యయ్యా! మీరింత చెప్పఁ గలరు. దుర్యోధనుదురాచారమునకుఁ బొడమిన క్రోధమునంజేసి పుత్రనిర్విశేషుం డైనప్రియశిష్యునిగుణముల నాచార్యుఁడు పేర్కొనియె. అది యొక్క పెద్దతప్పా? శత్రుఁడైనం గుణవంతుఁ డయ్యెనా తద్గుణముల నగ్గడింపవలయు. గురువైనను దోషవంతుఁ డయ్యెనా తద్దోషములఁ జూపి చెప్పవలయుంగదా? ఇదియొక్కతప్పుగ భావించి ప్రల్లదములాడిన నెట్లు సైఁపవచ్చు ననిచెప్పుటయు శాంతనవుండు వెండియుశాంతివచనంబులఁ జెప్పి యతని ననునయించె. అంత దుర్యోధనుఁడు ద్రోణుం జేర వచ్చి యాచార్యా! క్షమింపవలయు. ఇపుడు మీరుభేదముఁ దలంచి యొప్పరికించినం గార్యము సెడకుండునే? మీరు ప్రశాంతులరై ప్రకృతకార్యముఁ జూతురేని నాకు మేలు సేహాఱు నని భీష్మకృపకర్ణసహితుండై ప్రార్థించిన నయ్యాచార్యుఁ డిట్లనియె. కురుపితామహుండు సెప్పినప్పుడే యేను శాంతిం బొందితి. అది యట్లుండె. పదుమూఁడేఁడు లిడుమలఁ బడి యాకోపముఁ దీర్చుకొనఁగ గాండీవి యిదె వచ్చుచున్నవాఁడు. వాఁడు తప్పక దుర్యోధను నిగ్రహింపఁ

బ్రయత్నంబు సేయుము. సాహసమునఁ గొండె! మోహమునఁ గొండెఁ గురురాజు వానిబారిం బడి బమ్మగింపకుండఁగను సేనకు సేఁగి రాకుండఁగను నీతిప్రకారమున వ్యూహముఁ బన్నియుండవలయు. అర్జునుఁ డిప్పు డించుకేనియు శాంతిఁ బూనఁడు. కావున నెంతేఁ గడంకమై నుండవలయు. పాండవులయజ్ఞాతవాసంబింకను దీఱలేదని తొలుతఁ గురునృపాలుండు సెప్పె. ఆసంశయంబు దీర్పఁగ గాంగేయుండు నేర్చు ననుటయు భీష్ముఁ డిట్లనియె.

## భీష్ముఁడు పాండవుల యజ్ఞాతవాస నియమ పరిపూర్తి నిష్కర్షించుట.

కాలచక్రంబు కళాకాష్ఠాముహూర్త దినపక్షమాసర్తుసంవత్సరాది భేదమునం బ్రవర్తిల్లు. అందు గ్రహనక్షత్రచారభేదమునంజేసి యైదేసి యేండ్ల కొక్కతూరి రెండధికమాసంబులు వచ్చుచుండు. ఇట్లీపదుమూఁ డేఁడులకు వచ్చినయధికమాసంబులు గణింపఁగా నిప్పటి కైదునెలలుఁ బండ్రెండుసాళ్లు నధికము లగుచున్నవి. దానంజేసి పాండవులనియమవత్సరములు నిన్నటితోఁ గడచె. తమపూనినప్రతిజ్ఞ యథాశాస్త్రంబుగ నడిపియే యర్జునుడిట నగపడుచున్నవాఁడు. ధర్మార్థకోవిదులు మహాత్ములు ధర్మరాజోపదిష్టమార్గప్రవర్తులు నగువార లొక్కనాఁడేనియు ధర్మంబు దప్పి నడతురే? లోభము నూని దుష్కరవ్రతంబు సలిపి వచ్చినవారు లోభవశులై ధర్మంబు దప్పుదురేని నాఁడే యడవులకుఁ బోవక యుద్ధకాంక్షులై నిలిచిరేని దేవేంద్రుఁ డడ్డపడినను జయించి తమరాజ్యముఁ గొనియుండుదురు. వారిపరాక్రమంబు క్రొత్తయే? ధర్మపాశనిబద్ధు లయినయామహాత్ము లనృతంబుకంటెఁ జావుమే లని తలంచి సంకేతప్రకారంబు నడపిరి. ఇంక నిపు డాలసింపరాదు. అర్జునుఁ డిదె వచ్చినవాఁడు. సంగ్రామంబున జయాపజయంబులు నమ్మరాదు. లెస్సగఁ జింతించి యుద్ధసన్నాహ మొండె ధర్మసంయుతం బయిన సంధికార్యంబొండె శీఘ్రంబ చేయవలయు ననిన దుర్యోధనుండు పితామహా!

పాండవులకు నేను రాజ్య మియ్యను. సంధి పొసఁగదు. యుద్ధసన్నాహంబు శీఘ్రంబ సమకట్టుఁ డని పలికె. ఆమాట విని భీష్ముఁడు దుర్యోధనుం జూచి యట్లగు నేని పోరికైనం దగురీతి సమకట్టవలయు. సర్వప్రకారంబుల నేను శ్రేయస్సు చెప్పవలసినవాఁడ నగుటంజేసి చెప్పెద. నావచనంబు హితం బనితోఁచిన నట్లు చేయుఁడు. సేనలో నాలవపాలు గొని నీవు పురమునకుఁ బొమ్ము. తక్కటిచతుర్థాంశము గోగణరక్షణార్థంబు నిలుపవలయు. శిష్టంబు లయిన రెండుభాగములఁగొని యేను ద్రోణకృపాశ్వత్థామకర్ణులుం గట్టి మోహారంబు సేసి బీభత్సు నెదిరింతుము. అతండు గాక విరాటుండు వచ్చె నేనియు దేవేంద్రుఁడు వచ్చె నేనియు నేను సముద్రమును వేలయుంబోలె నిలుపరింతు నని చెప్పుటయు దుర్యోధనుం డిది లెస్స యని తత్ప్రకారంబు చేసె. అంత శంతనుపుత్రుండు సేన నొక్కవ్యూహంబుగాఁ బన్ని నడుమ నాచార్యుని డాఁపట నాచార్యపుత్రుని వలపటఁ గృపాచార్యుని నగ్రభాగంబునఁ గర్ణుని నిలిపి తాను సర్వసేనారక్షణపరుండై వెనుకటిదెస నిలిచియుండె.

---

# శ్రీమదాంధ్ర వచన భాగవతము

## దశమస్కంధము.

---

### కంసుఁడు రామకృష్ణులకుఁ గీడు సేయ నాలోచించుట.

అంత నక్కడ మధురాపురంబున నున్నకంసు నొద్దకు నారదముని యేతెంచి యశోదకుఁ గూఁతురు పుట్టుటయు దేవకికే యష్టమగర్భంబునఁ గృష్ణుండు జనించుటయుఁ రాముఁడు దొలుత దేవకీగర్భస్థుండై యటరోహిణీసుతుం డగుటయు వెఱపున వసుదేవుఁడు రామకృష్ణుల నాత్మమిత్త్రుం డైన నందునొద్ద నునుచుటయు వార లిప్పుడు నందవ్రజంబున నుండుటయు వారలే పూతనాప్రలంబాదుల వధించుటయుం దెలియఁజెప్పె. మునివచనంబు విని కంసుండు కోపవ్యథితచిత్తుండై వాఁడివాలుఁగొని వసుదేవుని వధింపఁ బూనుటయు నాదేవర్షి వారించె. నారదవచనంబున వసుదేవవధం బుడిగియుఁ గంసుండు తత్పుత్త్రులు దన్నుఁ బరిమార్తు రన్నయలుకపెల్లున నాదేవకీవసుదేవుల లోహపాశముల బంధించె. నారదుం డరిగినపిదపఁ గంసుండు కేశి యను వానిం బిలిచి నందవ్రజంబున నున్న రామకృష్ణులం దెగటార్పఁ బుత్తెంచి ముష్టికచాణూరశలతోసలకప్రభృతులను మఱియుఁ దగినమంత్రులను మావంతులనుం బిలిచి యిట్లనియె. వసుదేవునికొడుకులైన రామకృష్ణులు నాకు మృత్యువని నిర్దేశింపఁబడినవారు నందవ్రజంబున నున్నవారఁట. వారినిటకు రప్పింతు. చాణూరముష్టికులు మల్లయుద్ధమున నయ్యుద్ధతులం దెగఁజూడవలయు. అనేకమల్లులుగూడఁగ మంచిమంచియలు సవరించునది. పౌరజానపదులందఱు నావేడుక చూడవలయు. (అయ్యా! నాకాత్మబంధువులతోఁడిపగకు మూలంబు సెప్పెద నాకర్ణింపుఁడు. తొల్లి యుత్ఫుల్లవల్లీవేల్లితతరునికరములఁ జెలువారు కెంజివుళులను విరులను సొంపు మీఱి యున్నయుద్యానం

బున విహరించుచు బుతుస్నాతయై పతిసంగమంబు మనంబునం గోరుచున్నంతఁ దన్మనోగతం బెఱింగి ద్రమిడుం డను నొక్కగంధర్వుఁ డుగ్రసేనవేషముతో రమణీయదర్శనుండై యేతెంచి యధర్మమున నాపతివ్రతతోడ సంగమించె. అట నాసాధ్వి వాని నన్యపురుషుఁగా నెఱింగి యోరీ! యేల యిట్లు దుర్వృత్తి నడపి తని దూఱి యతండు దనగంధర్వకులమహిమోన్నతి చెప్పి యనులోమసంకరంబు దోషకారణంబు కాదని నిరూపించిన నాసతి సర్వభూతచేష్టితంబులకు సాక్షులైన భూజలానిలానలాకాశ సూర్యచంద్ర దిక్కాలధర్మాదుల సరకుగొనక తప్పుసేసి తని యదలించుచున్నంత నాతండు శాపంబునకు వెఱచి నాచేసినయది తప్పుగాదు. నావీర్యంబు వృథవోదు. శ్రీమంతుండు ధీమంతుఁ డుత్సాహవంతుఁడు నగుకొడుకు నీకుఁ బొడమెడు. నామాట తప్పదని చెప్పె. చెప్పినం బాతివ్రత్యహానికిఁ గుందుచు మాతల్లి యోరీ! ధర్మమర్యాదయతిక్రమించి యుత్పథంబున నున్మాదంబున నడచుచుఁ బాపములొనర్చునీకుఁ బొడముకొడుకు క్రూరుఁడు సాహసప్రియుఁడు నిర్ఘృణుఁడు దేవద్విజతాపసుల కననుగ్రాహ్యుఁడు నయ్యెడుమనిపల్కుటయు నట్టులైన నాతండు నీవారికిఁ బగవాఁడగు నని యతండు పలికి యంతర్ధానంబు నొందె. అట నస్మజ్జనని యావృత్తాంత మితరులకెవరికిం దెలియకుండ గోప్యంబు గావించి యుద్యానంబునుండి యింటి కరుదెంచి గంధర్వధారితం బైనయాగర్భమునం దఱితో నన్నుఁ గనియె నని తొల్లి నారదుండు నాకుఁ జెప్పియుండెఁ. అది కారణంబుగా నే నుగ్రసేనవసుదేవాదు లగుస్వజనులతోఁ బగఁ బాటించియుండుదు. వారిని వారికిఁ గూర్చువారినిం బరిమార్చిన నాకేమియు దోషంబు గలుగదు. రామకృష్ణులం దొలుతఁ జంపించిన నెల్లయు నిర్వృత్తప్రాయం బగు.) నందవ్రజమునుండి రామకృష్ణులిటకు వచ్చునంతకు మల్లయుద్ధమున కేర్పఱుపంబడు రంగస్థానంబునాఁకిటఁ గువలయాపీడనామకం బైనమదవేదండంబు నిలిపి తొలుతనే వారి నవ్వారణంబునకు బలిపెట్టవలయు. అగామిచతుర్దశినాఁడు ధనుర్యాగంబు దొడరుఁడు. భూతరాజునకు మేధ్యపశువుల విశసింపుఁడని వారి కానతి యొసంగె.

## రామకృష్ణులఁ దోడితేర నక్రూరునిఁ గంసుండు పంపుట.

అవ్విధంబునఁ గార్యతంత్రములందు నియోజ్యుల నియోగించి కంసుం డక్రూరుని బిలిచి యయ్యదుపుంగవు కేలు దన కేల నిముడుచు నిట్లనియె. దాశపతీ! యాదరంబున మిత్త్రకార్యం బొనర్పుము. వృష్ణిభోజులలోపల నీకంటె నొండొక్క హితుండు నాకుఁ గానంబడఁడు. ఇంద్రుండు విష్ణువు నాశ్రయించి స్వార్థము సాధించినవిధంబునం గార్యార్థభరంబు దొడరినదాన నేను నిన్నో సౌమ్యా! యాశ్రయించితి. నందవ్రజంబున కరిగి యందున్న వసుదేవసూనుల నిరథమునఁ దోడితెమ్ము. విష్ణుదేవుని ప్రాపుఁ గాంచినసుర లారామకృష్ణుల నాకు మృత్యువుగా నిర్దేశించిరఁట. కావున వారిని వారికిఁ బ్రాపైన నందాదిగోపాలకుల నుపాయనైపుణ్యంబున నిటకు నీవు తోడితెచ్చిన నిందుఁ గాలాంతకతుల్యంబైన యీకువలయాపీడవేదండము వారిం బొలియించు. దానికిఁ దప్పిరేని పిడుగువంటిమల్లులం బుఱికొలిపి చంపించెద. వారిద్దఱు మడిసిరేని తద్బంధువులైన వసుదేవాదులగు యదువృష్ణి భోజదశార్హప్రభృతులను వృద్ధుండయ్యు రాజ్యముఁ గోరు నాతండ్రి నుగ్రసేను నతనితమ్ముని దేవకుని మఱియు నాపగవారి నెల్లనుం బరిమార్చి భూతలంబు నిష్కంటకంబు గావించి నాగురు వగుజరాసంధుండు నాచెలు లగుద్వివిదశంబరనరకబాణప్రముఖులును దోడ్పడం జేర్చి దేవపక్షంబువారి నెల్ల నొక్కొక్కనిఁ గా నున్మూలించి యీమహి యెల్ల నేన యేలుదు. ఇయ్యర్థంబు నీమది నునిచి యిచ్చట నడుపంబడు ధనుర్మఖంబు వేడుకలు సూడను మథురాపురవిభవంబుఁ గనుం గొనను గా నారామకృష్ణులం దోడితెమ్మని చెప్పినం గంసున కక్రూరుం డిట్లనియె. రాజేంద్రా! నీకీడు దప్పించికొన నీవు వచ్చినయుపాయంబు లగ్గగుం గాని దైవాధీనంబులైనసిద్ధ్యసిద్ధులకుఁ దుల్యుండ వగుము. జనుండు దైవోపహతంబులైనకోర్కులు వెలుచం గోరి తదీయసిద్ధ్యసిద్ధులయెడ హర్షశోకములం గుడుచు. ఐన నీశాసనంబు సేయుదు నని యక్రూరుం డొడంబడుటయుఁ గంసుఁ డతనిం దక్కినమంత్రులను వీడుకొలిపి యంతర్గృహంబునకుఁ జనియె. అక్రూరుండు నిజనివాసంబున కరిగె.

## శ్రీకృష్ణుఁడు కేశి యనురాక్షసునిఁ జంపుట

అటఁ గంసునిపంపునం గేశి యశ్వరూపముఁ గొని ఖరఖురవిఘట్టనంబునంబుడమి బీఁటలువోవ సటాపటలవిధూననంబున నంబరంబున నంబుదంబులు విమానంబులును సంకులత్వంబు నొంద హేషితఘోషణంబునకు నిఖిలసత్త్వంబు వెఱచఱచి పఱవ విశాలనేత్రంబు వికటవక్త్రకోటరంబు బృహత్కంఠంబును లోకభీకరంబై యమర నంజనాచలసదృశంబై యెరికిం దేఱిచూడరాకుండ నుద్దండంబై గంసునకు హితము సేయ నెంచి నందవ్రజమునకుఁ జనుదెంచె. పరమభీకరాకారంబుతో నట్లు వచ్చి గోకులంబునం దన్ను వెదకుచున్న యామాయాహయముం గాంచి కృష్ణుండు సింహనాదంబు సేసి దానిం బోరికిఁ బిలుచుటయు నయ్యది యయ్యార్పు విని యాకసంబు మ్రింగుభంగి నోరు దెఱచి పాఱుతెంచి పిమ్మటికాళులం గృష్ణు నడిచె. అరవిందలోచనుం డత్తాఁకు దప్పించికొని పన్నగగ్రహణతీవ్రుం డైనవైనతేయునిచాడ్పున వీఁక నడరి యయ్యశ్వముకాళుల రెంటిని దనబాహువులం బట్టి యెత్తి నూఱువిండుల పెట్టుకోలఁదికి నేలతో విసరి వైచిన నది మూర్ఛిల్లె. కొండొకపడి కాసైంధవంబు దెలిసి లేచి రోషమున నోరు దెఱచి హరిని మార్కొన నేతెంచుటయు నమ్మధుసూదనుండు బిలమున నురగముంబోలె దానివ్యాత్తవక్త్రంబునఁ దనవామభుజముం జొనిపె. చొనుపుటయుఁ గ్రాఁగిన యినుపకట్టియం దాఁకిన నెట్టు లట్టులు భగవద్భుజంబు దాఁకి దానిపండ్లు రాలిపడియె. తురంగవక్త్రకుహరాంతరగతం బైన యచ్యుతభుజంబు దఱితోఁ దగిన చికిత్స లేక యుపేక్షితంబైనరోగంబురీతిం బ్రతిక్షణంబునం బెరుగుటయు నాఘోరనిశాటఘోటకంబు వాయుసంచారంబునకుఁ దనలో నెడగానక కాళులు దన్నికొనుచు మేనఁ జెమ్మటలు గ్రమ్మఁ గన్నులు గ్రిందికి మీఁదికిఁ దిరుగుడువడ లద్దివెట్టి యసువులం బాసి నేలం బడియె. లో నుబ్బినయచ్యుతభుజసమ్మర్దమునం జేసి దోసపండువోలె బ్రద్దలువాఱిన యాగుఱ్ఱపుఁ

పెఱుఁగుచోఁ బయుండి చతుర్భుజుండు దనభుజ మవలీలం దీసికొని యంబుల కబ్బురంబునొందిన దివిజుల ప్రస్తుతులకుం బ్రసూనవృష్టికి నిచ్చ మెచ్చె.

## నారదుఁడు శ్రీకృష్ణునొద్దకు వచ్చుట.

అట్టియెడ భాగవతవర్యుం డైననారదుం డేకాంతమున నారమాకాంతుసన్నిధికిఁ జనుదెంచి యిట్లని విన్నవించె. కృష్ణా! యప్రమేయాత్మ! యోగేశ్వరేశ్వరా! జగదీశ్వరా! వాసుదేవా! యఖిలాధారా! యదువర్యా! సమిత్తులలోనెల్ల నగ్ని యెట్టులట్టులు సర్వభూతములలో నీ వనుస్యూతుండవై గూఢుండవై బుద్ధికి నతీతుండవై సర్వసాక్షివై పరిచ్ఛిన్నమతులకు దుర్బోధుండవై సర్వేశ్వరుండవై వెలయుదువు. నీవు స్వతంత్రుఁడవై యాత్మేచ్ఛను దొలుత నాత్మమాయాయోగమునఁ గుణముల సృజించి సత్యసంకల్పమున నాగుణముల నీజగములకు సృష్టిస్థితిలయముల నొనర్తువు. భూభారంబైనదైత్యదానవాదులఁ బరిమార్చను సాధువులఁ బ్రోవను నీ వవతరించినవాఁడవు. తన హేషితంబునకే యనిమిషులు త్రివిదముఁ దొఱంగి పఱవ విక్రమంబున మెఱయుచుకేశి నశ్వరూపధరుని భాగ్యమునం బరిమార్చితివి. రేపు గడవ నుఱునాఁడు చాణూరుని ముష్టికుని మఱియుఁ గొందఱుజెట్లను మత్తమాతంగంబును గంసునిం జంపుదువు. ఆనృశంసు ననువర్తించుపంచజన యవనమురనరకాదులను గ్రమంబునఁ బొలియింతువు. ఇంద్రు నోడించి తల్లోకమున నుండు పారిజాతముం బుడమికిఁ దెత్తువు. వీర్యశుల్కమున వీరకన్యకలం బెండ్లి యవుదువు. ద్వారకను నృగునకు శాపముక్తిఁ గావింతువు. భార్యయగు జాంబవతితోడ స్యమంతకమణిం దెత్తువు. మహాకాళ పురమునఁ బ్రాహ్మణునకు మృతపుత్త్రుఁ బ్రతికించి యిత్తువు. పౌండ్రకుని వధింతువు. కాశీపురిం గాల్తువు. దంతవక్త్రుం దెగటార్తువు. ధర్మరాజురాజసూయమున శిశుపాలుం బొలియింతువు. మఱియుం నీవు ద్వారకలో వసించి యేయేకార్యముల నిఁకఁ జేయుదువు వానినెల్ల నేను గనుంగొనంగలవాఁడ. లోకసంహారార్థంబు కాలరూపుఁ డైననీవు సవ్యసాచికి సారథివై బహుళాక్షౌహిణులం బిలుకుమార్ప

నేను జూడ నున్నవాఁడ. ఆత్మపరమానందనిష్ఠ నఖిలకామములఁ బరిపూర్ణుండై నిజచిచ్ఛక్తిమహిమమున నాత్మమాయాకార్యగుణప్రవాహోపరతిం గాంచి సత్యసంకల్పుఁడై జ్ఞానైకమూర్తియై వెలయు నిన్నాశ్రయించెద. ఆత్మమాయాకల్పితవివిధవికల్పము లాశ్రయించి లీలార్థంబు యదుకులంబున మానుషవేషముం బూని స్వాశ్రయుండై యొప్పునీకు మ్రొక్కెద ననిపలికి యాదేవర్షిప్రవరుండు భగవంతునకుఁ బ్రణామం బాచరించి తదాజ్ఞంబడసి తద్దర్శనానందమున నుప్పొంగుచు నిజేచ్ఛం జనియె.

## శ్రీకృష్ణుఁడు వ్యోమాసురుం జంపుట.

అట భగవంతుఁడు కేశివధసంతుష్టచిత్తులైన గోపాలకులు బెరసి నడవ గోగణంబులఁ దోలుకొని సాయాహ్నంబున వ్రేపల్లియకుఁ జనియె. అంత నొక్కనాఁడు కృష్ణరక్షితులై గోపాలుర కొందఱెత్తములం బసుల మేపుచుఁ దమలోఁ గొందఱు మ్రుచ్చుడు గాఁగఁ గొందఱు గావలివారు గాఁగ నమరి నిర్భయులై డాఁగురింత లాడఁ దొడరి కొందఱు మేఁకలఁగా నెన్నిచోరాయితులు మ్రుచ్చిలించికొని యరిగి డాఁచుచుండిరి. అట్టియెడ మహామాయుఁడైన మయునికొడుకు వ్యోమాసురుఁ డనువాఁడు గోపాలరూపముం గొని వచ్చి గోకులంబు సొచ్చి మేషచోరాయితులైన యయ్యొరుదగలవారిం గొనిపోయి కొండగవిలోనికిం జొనిపి పృథుపాషాణంబున వాఁకిలి గప్పె. అట్లతండు నలువు రేవురు దక్కఁ దక్కినగోపాలకుల నెల్ల నాగిరికందరంబున నడంచు టెఱింగి సాధురక్షకుం డైనహరి మేఁకం బట్టుతోఁడేలు వీఁకం బ్రబలి తా నాగోపహారిం బట్టిన నాజెట్టిదుండు కొండవోలె మేను వెంచి కొలఁదికి మీఱి కడంగియుఁ గృష్ణునిపట్టు తప్పించుకొనఁ జాలక బమ్మరించుచుండె. అచ్యుతుం డట్టులు బిట్టు పట్టి వానిం గ్రిందఁ ద్రోచి చూచుఖేచరులు పిచ్చలింపఁ బశువుం జంపురీతి వానిం జంపి గుహావాఁకిటం బెట్టిన పాషాణముఁ దొలఁగించి యందున్నగోపాలకుల వెలువరించి సురలు ప్రస్తుతింప నాపన్నిర్ముక్తులైనగోపకులు పొగడ మగిడి గోకులంబునకుఁ జనుదెంచె.

## అక్రూరుఁడు నందవ్రజమునకుఁ జనుదెంచుట.

అక్కడ నక్రూరుం డారేయి గడపి వేకువను రథమారోహించి నంద వ్రజమునకుఁ జనుదేరఁ దఱలి తెరువునఁ దనమనంబున భగవద్భక్తితోఁగలు వాఱ నిట్లని తలపోసె. ఏ నేమిసుకృతంబు నేసితినో యేయుత్తమతపంబు సల్పితినో యేదాన మేసత్పాత్రమున కర్పించితినో నేఁడు కేశవుం జూడఁ బోయెద. శూద్రునకు వేదోచ్చారణంబువోలె విషయాత్ముఁడగునాకు హరి దర్శనంబు దుర్లభంబు. నదిలోనం బ్రవాహవేగమునఁ బోవుతృణాదులొక్కొ కతఱిం గట్టు సేరునట్లు లఘుఁడగునాకు నొకతఱి యాదృచ్ఛికంబుగఁ గాలగతిం బురుషోత్తమదర్శనంబు పొసఁగెడు. నేఁడుగదా నాయమంగ ళంబు నశింప జన్మము ఫలవంతంబు గాఁగ యోగిధ్యేయుని పాదారవిందము నకు మ్రొక్కెదు. హరిచరణకమలదర్శనంబు గూర నన్నుఁ బంపినకంసుఁ డును నాకుఁ బెద్దయు మేలొనర్చెనని తలంపవలయు. అమ్మహనీయపదార విందనఖకిరణములఁ దవిలి తొల్లింటి పెద్దలు భవసాగరంబు నిస్తరించిరి. బ్రహ్మాదు లర్చింపఁ బెంపు గాంచి గోపికుచకుంకుమంబునఁ గెంజాయ రంజిల్లి యనుచరులతోడఁ బసులమేపుచు నడవుల నడచునాకృష్ణుచరణముఁ గన్నులారఁ గనుంగొందు. సుందరకపోలనాసికావిలాసంబై స్మేరావలోకరుచిర నయనకమలాభిరామంబై సొంపారునారమాపతి నెమ్మొగమ్ముఁ జూతు. మృగము లెల్ల నన్ను డాఁపలించి యరిగెడు. భూభారంబు హరింపనాత్మేచ్ఛమైమనుష్య జన్మ మెత్తినలావణ్యధాముని దర్శనంబు నాకు నేత్రసఫలత్వంబు గావింపదనుట గాదు. ఎవ్వండు కార్యకారణంబుల కీక్షణకర్తయయ్యు నహంకారహీనుండై నిత్యస్వరూపసాక్షాత్కారమున నజ్ఞానమును దత్కార్యంబైనభేదమును దన్మూలకంబైన భ్రాంతిని బాసియుం నీక్షిత యగుతనయీక్షణంబున నాత్మ మాయాయోగమునం బ్రాణేంద్రియములతోడఁ దనయందే రచియింపంబడిన జీవులతోడ బృందావనంబునందును గోపికామందిరంబులందును లీలమైఁ దత్త

త్కార్యము లొనర్చి రక్తునిరీతిం దోఁచు సకలపాపహారంబులై పరమమంగళంబు లైనయెవ్వనిగుణకర్మజన్మములతోడం గూడినవాక్కులు జగంబులకు జీవనంబును శోభనంబును బావనత్వంబు నొదవించు నట్టి వాక్కులం బడయనివారిసర్వాలంకారములు శవాలంకారంబు లగు నప్పరమపురుషుండు తన ధర్మసేతువుఁ బాలించువారికి సుఖముఁ గావింప యదుకులంబున నవతరించి దేవగీయమానం బశేషమంగళంబు నగునాత్మకీర్తిని వ్రజమునం బ్రకటించుచుండెడు. మహాత్ములకు గమ్యుఁడైనవాని సర్వగురుండైనవానిఁ ద్రైలోక్యరమణీయంబై నయనానందసంధాయకంబై శ్రీదేవీకమనీయం బైనదివ్యసుందరమూర్తిఁ దాల్చినవాని నమ్మహాపురుషు నేను గాంతును. వేకువను నాకు శుభశకునంబులు పెక్కులు గానంబడియె. వినుము నందవ్రజంబు సేరి తేరు డిగ్గి వెనువెంటన జగదీశ్వరు లైనరామకృష్ణులచరణముల నాత్మలాభముఁగోరు యోగు లాత్మచిత్తములందు ధ్యానింపఁబడినవానిని వారితోడఁ జెలిమిసేయుం గోపాలురనుం బ్రణమిల్లుదునొక్కొ. ఆజగద్విభుండు కాలముపేరిటిసర్పము వడికి వెఱచి తన్నాశ్రయించినవారి కభయ మొసఁగుతనకరారవిందము నదుగులపయిం బడిననాశిరంబుపై నునుచు నొక్కొ. అమ్మహాత్ముని కరకమలంబు నర్చించి యింద్రుఁ డింద్రపదముం బొందె. బలి తనతలపై దాని ధరించి యిఁక నింద్రుఁడు గానుండెడు. సౌగంధికసౌరభముఁ బిసాళించు నప్పాణి పంకజంబకదా వివిధవిహారముల నలసి సొలసినవ్రేతలయలయికలం దీర్చెడు. క్షేత్రజ్ఞుఁడై తాను నిర్మలదృష్టిం బ్రపంచమున నఖిలభూతముల బాహ్యాభ్యంతరవృత్తులరయు నయ్యచ్యుతుండు కంసునిపంపున వచ్చినతద్భృత్యుం డని నాపై నరిబుద్ధి సేయఁ డని తలంతు. తన యంఘ్రిమూలమునఁ జాఁగిలఁబడిలేచి కేలు మొగిచియుండునన్నుఁ గరుణార్ద్రం బైనస్మేరవిలోకనమునఁ జూచునొక్కొ. దాన నేను బాపములనెల్లఁ బాసి శంక దక్కి పరమముదంబెనయుదు. సుహృత్తముఁడు జ్ఞాతి యనన్యదైవతుఁడు నగునన్నుఁ దనదీర్ఘబాహువుల నాకరుణానిధి కౌఁగిలించు. దాన నేను బరమపావనుండ నగుదు.

కర్మబంధముల నెల్ల నెడలుదు. కౌఁగిలించి కృతాంజలి యైననన్నుఁ దాత! యక్రూరా! యని పిలుచు. అప్పుడుగదా నాజన్మంబు ఫలవంతంబగు. కృష్ణుని యాదృతిం గానని నిర్భాగ్యునిజన్మంబు గాల్పనే! తన కొక్కఁడు ప్రియుండు నొక్కఁడు ద్వేష్యుఁ డొక్కఁడు సుహృదుఁ డొక్కఁ డుపేక్షణీయుఁ డనుట లేకున్న నమ్మహాత్ముఁడు కల్పవృక్షమురీతిం గొల్చువారికిఁ దగినట్టులు ఫల మొసంగు. బలరాముఁడు కృతాంజలి యైననాచేయి పట్టుకొని గృహంబులోనికిఁ దోడ్కొని యరిగి యుచితసమస్త సత్కృతు లొనర్చి బంధువులలోఁ గంసభృత్యుఁ డనియెన్నక నగవు దొలఁకు మొగమున మన్నించునే యని తనలోఁ జింతించుచు నక్రూరుండు బడమర రవి గ్రుంకునంతకు నంద వ్రజంబుఁ జేరం జనియె.

## అక్రూరుండు బృందావనంబున రామకృష్ణులఁ గాంచుట.

చని యచ్చట లోకపాలకిరీటసేవితపరాగపరీతంబు లైనపద్మనాభు నడుగులం బద్మయవాంకుశాదిరేఖాలాంఛితములైనవానిం గాంచి పరమాహ్లాదంబున మేను గరుపాఱ నానందాశ్రుజలంబులు గ్రమ్ముదేరం దేరు డిగ్గి బళే యియ్యవి యయ్యచ్యుతుచరణరేణువు లని యుపొర్లంగుచు వానిపయిం బడి యయ్యక్రూరుండు పొరలాడె. దంభమును భయమును శోకమునుం ద్యజించి యాశ్వఫల్కతనయుండు దన్నుఁ గంసుఁడు పనిచినక్షణంబు మొదలు హరిస్మరణశ్రవణదర్శనాదుల మనంబు తన్మయంబుఁ గావించె నను టే దేహధారులకుం బురుషార్థంబు. అతండట్లు పెద్దయుం బ్రొద్దు కృష్ణునడుగుల జాడపయిం బొరలిపొరలి లేచి రామకృష్ణులు గోష్ఠమధ్యంబున నున్నా రని గోపకుమారులవలనం దెలిసి తే రెక్కి సూర్యునివెలుంగు గనుపట్టునప్పుడే యయ్యీశ్వరుల గనుంగొనఁ గోరి రయంబునఁ బఱతెంచి గోదోహనస్థానంబున నున్న రామకృష్ణులం గాంచె పీతనీలాంబరధరులు శరత్కమలనేత్రులు నీలపాండురగాత్రులు శ్రీవిలాసపాత్రులు పీనాయతభుజులు సుందరవదనులు కరికలభవిక్రములు ధ్వజవజ్రాదిరేఖాలసత్పదకమలభాస్వరులు వనమా

లాదిమాల్యధరులు పుణ్యగంధానులిప్తులు సర్వాలంకారలక్షణసమంచితులు భూభారహరణార్థంబు నిజాంశమున నరరూప మెత్తిన ప్రధానపురుషులు నగు నాకృష్ణుని రాముని గాంచి యక్రూరుండు దటాలునఁ దేరుడిగ్గి నిజప్రభల దెసలు వెలిఁగించుచు రజతమరకతశైలంబులకరణిం దేజరిల్లు నారామకృష్ణుల యడుగుల ముందరఁ జాఁగిలం బడి భగవద్దర్శనాహ్లాదమున మేనం బులకలంకురింపఁ గన్నుఁగవ నానందజలంబులు గ్రమ్ముదేర నత్యుత్కంఠాభరమునఁ దన్నుఁ జెప్పికొనఁజాలకుండె. అదియెఱింగి భక్తవత్సలుం డైనభగవంతుఁడు చక్రలాంఛితం బైనతనకరంబున నతనిఁ జేరం జీరి కౌఁగిలించి కొనుటయుం బలదేవుఁడును బ్రణమిల్లియున్న యయ్యక్రూరుని లేవ నెత్తి కౌఁగిలించి కొని నిజపాణిపల్లవంబునఁ దదీయహస్తంబు గ్రహించి తమ్ముఁడును దాను నతనిం గృహాంతరంబునకుఁ దోడ్కొని చనిరి. అట నందుఁ డతని స్వాగతం బడిగి యుత్తమాసనంబునఁ గూర్చుండఁ జెప్పి విధియుతంబుగాఁ బాదప్రక్షాళనంబు సేసి గోవుతోడ మధుపర్కంబు నివేదించి మార్గాయాసంబున నలసిన యాశ్వఫల్కతనయునకుఁ బాదసంవాహనమున డప్పిపుచ్చి పావనం బైన రసవదన్నంబుఁ గుడువం బెట్టి భోజనానంతరము ముఖవాసంబుల గంధమాల్యంబులనుం బరమప్రీతి నాపాదించి యిట్లనియె. దాశార్హవర్యా! యాత్మప్రాణతర్పణపరుండై చెలియలి కుయ్యాలింపక యద్దేవకీదేవిబిడ్డలఁ జంపిన నృశంసుఁ డైనకంసుఁడు బ్రదికియుండఁ గటికవానియొద్ద నుండుగొఱియల తెఱంగున నెల్లకాలం బాపాపాత్ముప్రాపునఁ దప్పిజలై యుండు మీకుశలం బేమని విమర్శింతు ననిపలికిన నమ్మధురవచనంబుల కానందమొంది యక్రూరుండు మార్గాయాసంబు వాసె.

### రామకృష్ణు లక్రూరునితో సంభాషించుట.

అవ్విధంబున నందగోపకృతసత్కృతులం బడసి యక్రూరుండు పర్యంకమున సుఖాసీనుండై తాను వచ్చునెడఁ దెరువునఁ దనమదిలోఁ గోరిన కోరికలెల్లఁ బడసె. శ్రీనివాసుఁ డైనభగవంతుఁడు ప్రసన్నుఁడై నం బడయ

రాని యర్థముం గలుగునే? ఐనను భగవద్భక్తులు దేనిం గోరరు. అట్టియెడ శ్రీకృష్ణుండు రాత్రిభోజనంబు నిర్వర్తించి యక్రూరునియొద్దకుం జనుదెంచి తమవారియెడం గంసునివర్తనంబు నతనిచికీర్షితంబును వినం గోరి యాశ్వఫల్కసంభవున కిట్లనియె. తాత! సౌమ్యా! స్వాగతంబే? కంసునిపంపున వచ్చితివి. మీకు మే లయ్యెడు. సుహృదులకు జ్ఞాతులకు బాంధవులకును సుఖము నారోగ్యమునుం గలుగునే? మాకు మేనమామ యను పేర మనకుల మునకు రోగం బైనకంసుండు వర్ధిల్లుచుండ మనవారికిం దల్లిదండ్రులకుం గుశలం బేమని యడుగుదు? అక్కటా! మావలనం దల్లిదండ్రులకుం గష్టంబులు గలిగె. మానిమిత్తమునంగాదె పుత్త్రమరణంబులు వారి కయ్యె. కాంక్షితం బైన స్వజనసందర్శనము మాభాగ్యమున నేఁ డొనగూడె. మీర లరుదెంచిన పని యేమని యడుగుటయు నక్రూరుండు కంసునకు యాదవులపైఁ గలిగినవైరాను బంధము వసుదేవుం జెఱఁజూడఁ బూనుటయు నారదువచనంబున నతండు రామకృష్ణులు వసుదేవసూను లనియెఱుంగుటయుఁ దన కతండు పనివంచిన యుద్దేశంబును రామకృష్ణులను మధురకుఁ దోడికొని పోవఁ గంసునిపంపునఁ దాను దూతయై వచ్చుటయు మున్నుగా నెల్లవృత్తాంతముం దెలియఁ జెప్పె. నందుఁ డప్పుడు గోపాలుర నందఱం బిలిపించి యెల్లి మధురానగరంబునకుం బోవలయు. రాజున కటఁ గానుక పెట్టఁగ గోరసముల నెల్ల గొనుఁడు. శకటములఁ బూన్ప నేర్పాటు సేయుఁడు. అందుఁ బ్రవర్తిల్లు ధనుర్యాగంబు సూడ దేశవాసు లందఱును వత్తురఁట. మనము నవ్వేడుక చూచి వత్త మని చెప్పి నందుఁడు వ్రేపల్లియలో నెల్లెడం బ్రయాణంబుఁ జాటించె.

## గోపికలు మధుర కరుగుకృష్ణువిరహమున కడలుట.

చాటించుటయుం గోపికలు రామకృష్ణుల మధురకుఁ దోడ్కొని పోవ నక్రూరుండు వచ్చె ననియుం రేపకడ వారు దఱలుదు రనియు విని భావి వియోగమునకుఁ జింతించుచు మోము వాడినవారును వస్త్రవలయకేశపాశం బులు వీడినవారును కృష్ణుఁ జింతించుచుఁ బెఱవృత్తులు సాలించినవారును ముక్తిఁ బొందినవారితీరున నీలోకము మఱచినవారును గృష్ణుఁడు చిత్రముగ

ననురాగాతిశయమునం బలికిన హృదయంగమవచనములఁ దలపోసి మోహా
మొందువారును స్మేరావలోకరుచిరంబు లైనయాలీలాగోపాలునిశోకహర
కార్యంబుల నుద్దామచరిత్రంబులఁ జింతించువారునై యయ్యచ్యుతుపైమనంబు
నిలిపి భావితద్వియోగంబున కడలుచు నశ్రుపూర్ణలోచనలై తమలో నిట్లని
వగచిరి. విధాతృఁడా! యక్కటా! నీకొక్కనిమీఁదనైనం గరుణలేదుగదా?
మైత్రినిఁ బ్రణయమునను దొలుతఁ బ్రాణులఁ జేర్చి వారలు కృతార్థులగు
టకుమున్న యెడఁబాపుదువు. పిల్లవానియాట లెట్లట్లు నీచెయ్వులు నిరర్థకం
బులు. నీలకుంతలావృతంబై సుందరకపోలనాసికావిలసితంబై శోకహారదర
హాసితరుచిరంబై యొప్పుముకుందుని నెమ్మొగమ్ముం జూపి యట నదృశ్యంబు
గావింపఁబూనితి విది సాధుకృత్యంబుగాదు. నీ సకల సృష్టిసామర్థ్యంబుల
కెల్ల నేకాశ్రయం బైనగోవిందువదనంబుఁ గాంచినమాకన్నుల నక్రూర
వ్యాజమున నోక్రూరుఁడా! హరింపఁ బూనితివి. ఆనందనందనుఁ డన్నో
క్షణభంగురసౌహృదుండు గావునఁ గ్రొత్తక్రొత్తలు మెచ్చుచుఁ బతిపుత్త్రబాం
ధవగృహాదులం ద్యజించి తన కూడిగంబు సేయవచ్చినమాదెసం జూడఁడు.
క్రేగంటిచూడ్కుల వేడ్క సేయు లేనగవుజిగులఁదుఱఁగలిగొనుముకుందువద
నము చూచుమథురాపురసుందరులకు రాత్రి సుప్రభాతం బగు. కోర్కులు
సత్యము లగు గోవిందుఁడు ధీరుఁడయ్యుఁ బిత్రాదిపరతంత్రుఁడయ్యు నన్నా
గరికవిలాసినుల లజ్జాలలితవిభ్రమంబులకును, మధురభాషితంబులకుం జొక్కి
యిక్కడి గ్రామ్యుల నిఁకఁ దలంపునకుఁ దెచ్చునే? గుణాస్పదుం డైనశ్రీరమ
ణుం జూచుపాంథులకును మధురానగరవాసులకును గన్నులపండువు గాఁగల
యది. మమ్ము నూరార్పక ప్రాణములకంటెఁ బ్రియుండైన నందనందనుం
జూడ్కిమేర మీఱఁ దోడుకొని పోవ నరుదెంచిన యీనిర్దయుని కక్రూరుం
డనుపేరుచెల్లదు. అతిక్రూరుఁ డైనయతని కక్రూరనామం బెట్టులు గలిగెనో
యూహింపరాదు. కఠినచిత్తుఁ డైనకృష్ణుండు తేరుపూన్చినంతన యారో
హించి తఱల మనసు వెట్టెను. దుర్మదు లైన యీవృద్ధగోపకులు నతనిమతం
బనువర్తించి బండ్లు గట్టించుచున్నవారు. దైవమును మనకుఁ బ్రతికూలం

బయ్యె. మనమేగి మాధవుని వారింతము. ఒకనిముసమైన విడువరానిముకుంద సంగమును దైవమునఁ బాసి రిత్తవోయినచిత్తమ్ముల నుమ్మలించుమనలం గుల వృద్ధబాంధవు లేమి సేయంగలవారలు? రాసగోష్ఠియందు సుందరమందహాసముల నపాంగవిలోకముల గాఢాలింగనములను రేలెల్ల నొక్కనిముసంబకాఁ గడపి సుఖించినమన మెట్లు లీదురంతవియోగతిమిరంబు నిస్తరింతుము? గోరేణువులు గ్రమ్మినయలకలు గప్పినసెమ్మొగముతో లలితముగఁ బిల్లనగ్రోవి యూఁదుచు విలాసమునఁ గటాక్షించుచుఁ బ్రదోషవేళల వ్రేపల్లెకు గోపపరివృతుండై రామునితో నేతెంచుముకుందునిఁ గానక యొక్క నిముసంబైన నెట్లుండ నేర్తుమని గోపసుందరులు గోవిందుని పయిని డెందము నిలిపి తద్వియోగంబునకు వగచుచు సిగ్గు విడిచి గోవింద! దామోదర! మాధవా! యని పెలుచ విలపించిరి.

## అక్రూరుఁడు రామకృష్ణులఁ దోడ్కొని మధురకుఁ జనుట.

హరివిరహమునకు వగచుచు గోపిక లట్టు లడలు చుండునంతఁ బ్రొద్దు వొడుచుటయు నక్రూరుండు స్నానసంధ్యావందనాదికృత్యంబులు నిర్వర్తించి తేరు పూన్పించి తెచ్చి రామకృష్ణుల నందుఁగూర్చుండఁజెప్పి వారు రథారూఢు లగుటయుఁ దాను సారథికృత్యంబునకుఁ బూని తఱలె. నందప్రభృతు లయినగోపాలురును శకటంబులపై నానాగోరసముల రాజునకుఁ గానుక వెట్ట సంగ్రహించి కృష్ణుని తేరివెంబడి నడిచిరి. గోపికలు ప్రయాణోన్ముఖుండైనముకుందునొద్దకుఁ జని మగిడి త్వరితంబుగ వత్తు నని యత్తామరసాక్షుండు సెప్పినమాట కూఱడిల్లి రథకేతనంబు నటఁ బరాగపటలంబు నగపడు నంతకు నచ్చటన తమమనమ్ముల నమ్మాధవుని వెంటఁ బంపిరో నాఁగఁ జెయ్వులు దక్కి చిత్తరువులట్టు లుండియుండి పెద్దయుం బ్రొద్దు కృష్ణుండు మగిడి వచ్చునో యని చూచిచూచి యిఁక రాఁ డని యయ్యాశ విడిచి యింటికిఁ జనుదెంచి కృష్ణచరిత్రంబులఁ గీర్తించుచుఁ దలంచుచు వనట యుడిగిరి. అక్కడ నక్రూరుఁడును రామకృష్ణులును వాయువేగం బైనరథంబున యము

నానదికిఁ జనిరి. అట హరి తానన్నయుఁ దేరు డిగ్గి మధురనిర్మలం బైన తన్నదీజలంబు లాచమించి త్రావి తరుతలంబునఁ గొండొకవడికూర్చుండి యటఁ దేరెక్కె. అక్రూరుఁడు వారిం దేరిపై నాసీనులఁ జేసి తదామంత్రణంబు వడసి స్నానార్థం బమ్మహానదికిం జనియె.

## అక్రూరుఁడు యమునలోపల రామకృష్ణులఁ జూచుట.

చని యక్రూరుండు వేదమంత్రముల జపించుచు యమునానదిమడుఁగులో మునిఁగి యచ్చట రామకృష్ణులంగాంచి రథస్థులై యున్నవీరలిట కెప్పుడు వచ్చిరి? తేరిమీఁద లేరు కాఁబోలు నని తలంచుచు లేచి తొల్లింటిచందమున స్యందనమున నున్నవారింగాంచి యిది యేమి యిప్పుడు వీరు నీరిలో నగపడి రిటఁజూడఁ దేరిపయి నున్నవారు. వాస్తవముగ జలములోపల లేరొక్కొ యని వితర్కించి క్రమ్మఱ నమ్మడువులోన మ్మునిఁగి యందు సహస్రఫణామండలప్రభలు వెలుఁగ శిఖరనికరవిలసితం బైనకైలాసశైలంబుచాడ్పునఁ దెల్లనిచాయ నుల్లసిల్లి యవనతకంధరు లైనసిద్ధగంధర్వాదుల ప్రస్తుతు లాలించుచున్నబలదేవమూర్తియైనయనంతునినీలాంబరోజ్జ్వలం బైన సుందరగాత్రంబునఁ బీతాంబరమరీచు లెసంగఁ బీనాయతచతుర్భుజసముల్లాసంబు వెలయఁ బుండరీకాయతలోచనద్యుతు లలర సుందరభ్రూకర్ణనాసికారుణాధరప్రసన్నవదనంబున స్మేరవిలోకనమాలికలు నిగుడఁ గౌస్తుభవనమాలోజ్జ్వల వక్షస్స్థలంబున శ్రీదేవి మెఱయ వళిత్రయవిరాజితం బైనయశ్వత్థదళాకారోదరంబు దనరఁ గంబుకంఠంబు నిమ్ననాభివివరంబు బృహత్కటితనుశ్రోణికరభోరుజానుజంఘాద్వయంబులును జెలంగ నుత్తుంగ గుల్ఫంబు లరుణనఖంబులు మృదులాంగుళ్యంగుష్ఠంబులు నెసంగ నొప్పుపాదారవిందద్వయంబును సొంపార మణికటకకటిసూత్ర కిరీటకేయూరాది భూషణకిరణంబులు నెఱయ శంఖచక్రగదాపద్మంబులు కరముల నుల్లసిల్ల సునందనందాదు లైనపార్షదులయు సనకాదియోగులయు బ్రహ్మాదిగీర్వాణులయు మరీచ్యాది ప్రజాపతులయుఁ బ్రహ్లాదనారదాది భాగవతప్రవరులయు

వివిధవిమలవినుతుల నాకర్ణింపుచు శ్రీపుష్టివాక్కీర్తి కాంతితుష్టీలోర్జా విద్యావిద్యాశక్తిమాయాదులు పరివేష్టించి కొలువఁ గొలువై యున్న భగవంతుని గనుంగొని పరమభక్తిభరంబున రోమాంచకంచుకితగాత్రుండై బాష్పసంభృతనేత్రుండై యయ్యక్రూరుండు ధైర్యముఁగొని కృష్ణుఁడే భగవంతుఁడని తెలిసి సాష్టాంగప్రణామం బొనర్చి నిటలతటంబున నంజలిపుటంబు ఘటియించి మెల్లమెల్లన గద్గదస్వరంబుతో నిట్లని ప్రస్తుతించె.

## అక్రూరుఁడు భగవంతుని స్తుతించుట.

ఎవ్వనినాభిలోనం బుట్టినబ్రహ్మవలన నీలోకంబు గలిగె నయ్యఖిలకారణకారణాత్ముఁడైననారాయణున కాదిపురుషున కాద్యున కవ్యయునకేను మ్రొక్కెద. దేవా! పంచభూతంబు లహంకారము మహత్తత్త్వము ప్రకృతి పురుషుఁడు మనస్సింద్రియంబులు సర్వేంద్రియార్థంబులు సురలు ననంగ గలుగుజగత్కారణంబులెల్ల నీయంగమునం బుట్టె. అయ్యవియెల్లనానాత్మభూతము లవుటంజేసి నీస్వరూపం బెఱుఁగఁజాలవు. జీవుఁ డాత్ముఁడయ్యుమాయాగుణబంధనిమిత్తమున నెఱుంగఁ జాలకుండెడు. కొందఱు సాధుయోగు లధ్యాత్మాధిభూతాధిదైవసాక్షియై యంతర్యామిమహాపురుషుఁగా నిన్నుఁ గొల్తురు. కర్మయోగులైనకొంద ఱింద్రాదినానాదేవతారూపముల నిన్నే త్రయీవిద్యచే నానాయజ్ఞముల నారాధింతురు. జ్ఞానులైనకొందఱు సర్వకర్మములు నీయందు సన్న్యసించి యుపశమంబుఁ గొని జ్ఞానస్వరూపుఁడైననిన్ను జ్ఞానయజ్ఞమున ధ్యానింతురు. శైవవైష్ణవదీక్షలం బొందినకొందఱు తదాగమోక్తప్రకారబహుభేదముల నానామూర్తి నేకమూర్తినిగా నిన్నుపాసింతురు. అందఱును దత్తద్దేవతానామభేదమున భిన్నమతులై నానాదేవతాభక్తులైనకొందఱు సర్వదేవతామయుండ వైననిన్నే పూజింతురు. వర్షము గురియ జలపూర్ణంబులై పాఱునానాగిరినదు లయ్యైమార్గములఁ దుదిసముద్రమునే చేరుచందమున భిన్నభిన్నప్రకారంబులైనపూజ లన్నియుఁ దుదినిన్నే చెందెడు. సత్త్వము రజస్సు తమస్సనునివి మూఁడును బ్రకృతిగుణ

ములు. బ్రహ్మాదిస్థావరాంతంబు లైనభూతంబు లన్నియు నందు బ్రోతంబులు. అయ్యది నీయం దుండెడు. అవిద్యాకృతం బైనయీసంసారము దేవమనుష్య తిర్యగ్దేహాభిమానులందుఁ బ్రవర్తించెడు. వానిందవులక సర్వసాక్షియైనసర్వాత్ముఁడై వెలయునీకుఁ బ్రణామంబు. దేవా! నీ కగ్ని ముఖము భూమి పాదము సూర్యుఁడు నేత్రము నభంబునాభి దిక్కులు శ్రవణంబులు దివంబు మూర్ధంబు సురలు భుజములు సముద్రములు కుక్షి వాయువు ప్రాణబలంబులు వృక్షౌషధులు రోమంబులు మేఘములు కేశములు పర్వతము లస్థినఖము లహోరాత్రములు ఱెప్పపాటులు ప్రజాపతి మేఢ్రంబు వర్షము వీర్యము నగు. అవ్యయాత్మా! పరిపూర్ణుఁడు మనోవృత్తివ్యంగ్యుఁడు నగునీలోపల బహుజీవసంకులంబు లైనలోకంబులెల్ల జలాంతరమున సూక్ష్మప్రాణ్యండరాసులును మేడిపండులోపల సూక్ష్మ మశకంబులు నెట్టు లట్టులు చరించుచుండెడు. నీవు క్రీడార్థం బేయేరూపముల ధరింతు వయ్యేరూపముల నిరస్తశోకులై జనులు నీకీర్తిం గీర్తింతురు. కారణమత్స్యరూపమునఁ బ్రళయార్ణవంబున విహరించియు హయగ్రీవుఁడై మధుకైటభుల వధించియుఁ గూర్మంబై మందరము వహించియు వరాహంబై భూమి నుద్ధరించియు నరసింహమూర్తివై హిరణ్యకశిపుని బరిమార్చి సాధువులకు భయంబు వాపియు వామనుఁడై పాదక్రమమున ముల్లోకము లాక్రమించియు భార్గవరాముఁడై దుష్టక్షత్రియులఁ దెగటార్చియు రఘురాముఁడై రావణుంజంపియు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధరూపముల యదుకులమునందు దుష్టశిక్షణశిష్టరక్షణార్థ మవతరించియు బుద్ధరూపమున దైత్యదానవాంశజులకు మోహముఁ గావింపను గల్కిరూపమున మ్లేచ్ఛప్రాయులగురాజులఁ దెగఁజూడను దలంపు గొనియు వెలయునీకు మ్రొక్కెద. నీమాయ కీలోకమెల్ల మోహమొంది యేను నాయది యనునభిమానమునం గుంది కర్మమార్గములఁ బరిభ్రమించుచుండెడు. ఏనును దేహపుత్రకళత్రబంధువిత్తగృహాదు లగుస్వప్నతుల్యపదార్థంబులు సత్యములని తలంచి మూఢుఁడనై యందే భ్రమించుచున్నవాఁ

డను. అనిత్యము లగుదేహాదులయెడ నాత్మబుద్ధిం జేసి వ్యత్యస్తమతినై ద్వంద్వములం దవిలి తమంబునం బడి యాత్మప్రియుం డైననిన్నుఁ దెలియ నయ్యెద. తృణచ్ఛన్నం బైనజల మరసి కనుంగొన నేరక యెండమావులకుఁ బఱచుజలార్థి తెఱంగున మాయాశబలితుం డైననిన్ను విచారించి తెలిసికొననేరని పరాఙ్ముఖుండనై సంసారమునం ద్రిమ్మరుచుండెద. కామకర్మహతంబై విషయసంక్షుబ్ధంబు లైనయింద్రియముల నిటునటు నీడువంబడుమనస్సును గృపణమతి యైనయేను నిరోధింపఁ జాలనయ్యెద. అట్టినే నిప్పుడు నీపాదమూల మాశ్రయించితి. ఈశ్వరా! యియ్యదియు నీయనుగ్రహంబ కాని యొండు కాదు. పురుషునకు సంసారమోక్షము గలుగఁ గాలము గూడినప్పుడే సాధుసేవామూలమున నీపాదపద్మములపై బుద్ధిఁ బ్రవర్తించెడు. జ్ఞానస్వరూపుఁడు సర్వజ్ఞానకారణాత్ముఁడు పురుషులకు సుఖదుఃఖము లొదవించు కాలాదులకు నియామకుఁడు పరిపూర్ణుఁడు మాయాశక్తియుక్తుఁడు చిత్తాధిష్ఠాతృవాసుదేవస్వరూపుఁ డహంకారాధిష్ఠాతృసంకర్షణాత్ముఁడు బుద్ధ్యధిష్ఠాతృప్రద్యుమ్నరూపుఁడు మనోధిష్ఠాత్రనిరుద్ధస్వరూపుఁడు నగునీకు నమస్కారము. శరణాగతుఁ డైననన్ను రక్షింపు మని యక్రూరుండు ప్రస్తుతించి ప్రార్థించుచుండునంత నటుఁడు నాట్యముఁ జూపినట్టులు భగవంతుఁ డాశ్వఫల్కతనయున కాజలంబునఁ జూపినరూప ముపసంహరించె.

భగవంతుఁ డంతర్హితుం డగుటయు నక్రూరుం డమ్మడువు వెడలి మధ్యాహ్నికక్రియలు నిర్వర్తించి విస్మయమానమానసంబుతో రయంబున నేతెంచి తేరెక్కుటయు హరి యయ్యా! భూమినిఁగాని యాకాశమునఁగాని జలమునఁగాని నీ వెయ్యదేనియుఁ జిత్రంబుఁ గనుంగొంటివే? నీరూపంబాచందమునఁ గనుపట్టుచున్న దనియడుగ నక్రూరుండు దేవా! భూమ్యంతరిక్షసలిలంబులలో నెల్లఁ గలుగుచిత్రంబుల కన్నిటికి నాశ్రయంబై పరిపూర్ణుఁ డైననిన్నుఁ గనునా కొండొకచిత్రంబు దోఁపదనిచెప్పి రయమునం దేరుదోలి మార్గమున నచ్చటచ్చట గ్రామవాసులు రామకృష్ణులం బ్రీతిబంధు

రంబుగఁ గనుంగొనుచుండఁ బ్రొద్దుపడమరకు వ్రాలినపదంపడి మధురోపాంతమునకుఁ జనియె. అంతకు నందప్రముఖు లైనగోపాలురు ముం దరిగి మధురానగరిబహిరుద్యానంబులందు రామకృష్ణులరాక వేచియుండిరి. అట్టియెడ భగవంతుఁడు వినయావనతుం డైనయక్రూరునికరంబుఁ దనపాణితలంబున గ్రహించి నవ్వుచు నయ్యా! నీవు ముం దరుగుము. ఏ మీదిన మిచట విడిసి రేపు నగరి కరుదెంతు మనిన నగ్గాందినీసుతుండు దేవకీసుతున కిట్లనియె. భక్తవత్సలా! ఏను మిమ్ము విడిచి మధురాపురంబుఁ జొర నొల్లను. నీకు భక్తుఁడైననన్ను విడువఁదగదు. నీవు నన్నయు సకలగోపాలురను జెలులనుం దోడుకొని మదీయగృహమునకు విచ్చేసి మమ్ము నాథవంతులఁ గావింపుము. నీపాదపరాగమున గృహస్థు లైనమాగృహములకుఁ బవిత్రత్వం బాపాదింపుము. భవత్పాదశౌచతీర్థమునఁ బితరు లగ్ను లమరులునుం దనియుదురు. నీపాదయుగళముం గడిగి బలి పుణ్యకీర్తి నుల్లసిల్లి యింద్రపదంబును బరమభక్తగతినిం గాంచె. నీపాదశౌచసలిలంబులే గంగానదియై పాఱుటయుం శర్వుండు శిరంబున ధరించె. అమ్మహనీయతోయంబులే కదా సగరసుతులకు స్వర్గతిం గలిగించె దేవదేవ! జగన్నాథ! పుణ్యశ్రవణకీర్తన! యదూత్తమ! యుత్తమశ్లోక! నారాయణ! నీకుఁ బ్రణామం బని వేఁడికొనియె. అవ్వేఁడికో లాకర్ణించి కృష్ణుం డయ్యా! యేను యాదవద్రోహి యగుకంసుం బరిమార్చి సుహృదులకుఁ బ్రియము సమకూర్చి యార్యసమన్వితుండనై మీగృహంబునకుఁ జనుదెంతుఁగాని యిప్పుడు వీడుకొను మనిచెప్పుటయు నక్రూరుండు మాఱుపలుక నేరక యెల్లనివానిరీతి నూరకుండి యట నమ్మధుసూదను వీడ్కొని మధురాపురంబు సొచ్చి తనపనియెల్లఁ గంసునకు నివేదించి నిజగృహంబునకుఁ జనియె.

### రామకృష్ణులు మధురాపురముఁ బ్రవేశించుట.

అంత నపరాహ్ణము గడవం జల్లప్రొద్దున రామకృష్ణులు మధురానగరంబు చూడ నెంచి గోపాలపరివృతులై స్ఫటికగోపురద్వారముల నొప్పు

దానిఁ గనకకవాటతోరణంబుల నలరుదానిఁ దామ్రారకూటమయధాన్యాద్యగారముల వెలయుదాని నగాధపరిఖాపరివృతం బైనదాని రమ్యోపవనోద్యానముల శోభిల్లుదానిఁ గాంచనచతుష్పథంబులను మేడలను గృహారామములను నొక్కొకతెగవారిసభలను నితరగృహములను విలసిల్లుదాని వజ్రవైదూర్యనీలవిద్రుమమౌక్తికమయంబు లైనకొణిగలను వేదికలను సోరణగండ్లసందులను గుట్టిమంబులనుం గూర్చున్నకపోతమయూరముల మంజురావముల నమరుదాని సలిలసంసిక్తంబు లైనరాజవీథులందు నాపణవీథులందును మార్గములందును జత్వరములందును నిండారఁ జల్లిననవమాల్యాంకురలాజాక్షతతండులంబుల నింపారుదాని దధిచందనసిక్తంబులైనపూర్ణకుంభములను బల్లవప్రసూనఫలవృంతముల నొప్పురంభాక్రముకతరువులను గేతనంబులను జెలంగుద్వారదేశములఁ బ్రకాశించుదాని నమ్మధురానగరిం జొచ్చుటయు నారామకృష్ణులం గాంచ వేడుక వొడమి పౌరచారుముఖులు సంభ్రమంబున మేడ లెక్కిరి. తమ వచ్చునంతకు రామకృష్ణులు మిగిలి యరుగుదురో యను తత్తఱంబున నత్తెఱవలు తబ్బిబ్బులు గాఁగఁ గట్టియుఁ దొడిగియు జతలుజతలుగఁ గైసేయం దగినకటకకుండలాదుల నొక్కొక్కదానినే ధరించియు నొండొక్కదానిం దాల్పు మఱచువారై యొక్కకంటికే కాటుక వెట్టి రెండవదానికిఁ బెట్టనివారై చేయుచుండినభోజన ముడుగువారై తలయంటికొని జలక మార్పనివారై నిద్రించుచుండి చక్క నవరించికొననివారై పాలు గుడుచుచున్న బాలురఁ దిగవిడుచువారై వడింబాఱుతెంచుటయు నరవిందలోచనుండు విలాసప్రౌఢస్మేరాపాంగవీక్షణంబుల వారిచిత్తంబు లాకర్షించుచు గజేంద్రగమనంబున నన్నతోడ నన్నగరవీథులం జనియె. నయనానందసంధాయకుం డైన యాలీలాగోపాలునిం గాంచి పౌరకామిను లమ్మహాత్ముని మందహాసామృతంబుఁ జిలుకులలితవిలోకనంబులకుఁ జొక్కి యయ్యానందమూర్తి నాత్మమానసములఁ గౌఁగిలించికొని పులకలు మేనం గ్రమ్ముదేరఁ బరమానందము నొంది మనోవ్యథలు వాసి ప్రేమాతిశయంబున నెమ్మొగమ్ము లుల్లసిల్ల నారామకృష్ణుల

పయిం గుసుమవర్షంబుఁ గురిసిరి. ద్విజులు ప్రముదితులై దధ్యక్షతచందన మాలికాపూర్ణకుంభము లుపాయనంబులుగా నర్పించి యయ్యన్నదమ్ముల నర్చించిరి. నరలోకమహోత్సవాకారు లైనయీసుకుమారులఁ బ్రతిదినంబు గనుంగొన గోపికలు దొల్లి యెంతతపంబు సేసిరో యని పౌరులెల్ల విస్మితులై ప్రశంసించిరి.

## శ్రీకృష్ణుఁడు రజకుని వధించి వస్త్రముల గ్రహించుట.

అవ్విధంబున మధువైరి మధురానగరంబున నన్నతోడ నరుగుచు రంగరి యైనరజకుం గాంచి యోచాకలీ! మాకిరువురకుం గట్టఁగ మేలి నిర్మల వస్త్రము లిమ్ము. దీన నీకు నిస్సంశయముగ మే లగు నని యడిగిన నాచాకలి కంసుపరిచారకుండు గావున దుర్మదుండై రోషమున నధిక్షేపించుచు యదువీరుల కిట్లనియె. బాలిశులారా! యడవులను గొండలను నుండువా రద్వృత్తులై నిత్య మిట్టివస్త్రములం గట్టిరే? రాజద్రవ్యముల నేల కోరుదురు? తొలఁగి చనుఁడు. బ్రదుకఁ గోర్కి గలదేని యిఁక నిట్టికోర్కులు గోర వలదు. రాజభటులు చూచిన నిట్టివారిం గట్టియుఁ గొట్టియు సొమ్ము హరింతురని పెక్కులు ప్రేలుటయు నలిగి దేవకీసూనుండు వానితలఁ బదాగ్రమునఁ దన్ని క్రిందఁ ద్రోచె. అంత నారజకునియనుచరులు దమతమచలువలమూటలటఁ బాఱవైచి యెల్లెడలం బఱచిరి. రామకృష్ణు లావస్త్రరాసులలోఁ దమకుఁ గూర్చుమేలియంబరంబులం గొని కట్టి కొన్నింటిని దమతోడిగోపాలుర కొసంగి మిగిలినవాని నట విసర్జించి యరిగిరి.

## శ్రీకృష్ణుఁడు తంతువాయమాలాకారుల సమ్మానించుట.

అట్లరుగుచు వారు ముందర నొకతంతువాయుం గాంచిన నాతండు వారికి విచిత్రవస్త్రము లొసంగి యలంకారంబు సేసినం గృష్ణుఁడును రాముఁడును బర్వమున నలంకృతగాత్రంబు లైనకరికలభములకరణిం జూడనొప్పిరి. వానికిఁ బ్రసన్నుఁడై పన్నగశయనుం డాత్మసారూప్యమును శ్రీవిభవంబును

బలైశ్వర్యస్మృతీంద్రియపాటవంబులనుం బ్రసాదించె. అట నయ్యన్న దమ్ములు సుదాముఁ డనుమాలకరియింటికిఁ జనుటయు నమ్మాలాకారుండు వారిం గాంచి తటాలున లేచి చాఁగిలం బడి మ్రొక్కి యుత్తమాసనంబులఁ గూర్చుండఁ జెప్పి పాద్యము నర్ఘ్యము నొసంగి సకలపరికరంబులం బూజించి మేలిపూఁతలఁ బూసి విరిదండలఁ గైసేసి తాంబూల మర్పించి యారామ కృష్ణులను వారివెంట నేతెంచిన గోపాలురనుం బ్రీతిమై నర్చించి యయ్యాదు పుంగవుల కిట్లనియె. ఈశ్వరులారా! మీరలు మాయింటికి విచ్చేయుటం జేసి నాజన్మము సార్థకంబయ్యె. కులము పాలితంబయ్యె. నాపితరులు దేవతలు ఋషులును దృప్తినొందిరి. జగత్కారణాత్ములైన మీర లీవిశ్వముభవమున కును క్షేమమునకు నీరూపముల నిందవతరించినవారలు. సర్వభూతములకు సములు సుహృదులునై భజించువారల భజించుచుమా కెందును వైషమ్యంబు గలుగదు. భృత్యుఁడైననన్నుఁ దగినపని సేయం బంపుఁడు. మీకు నియోజ్యుఁ డగుటను టింతయే పురుషునకుఁ బరమానుగ్రహం బని విన్నవించి సుదా ముఁడు రామకృష్ణు లుత్తమమాల్యములఁ గోరుదు రని వారియభిప్రాయంబుఁ దాన యరసి క్రొత్తనెత్తావుల నలుగడలఁ బిసాళించునవమృదులకు సుమవిసర ములఁ గూర్చినకోమలమాలిక లర్పించి నేర్పునం గైసేసె. అయ్యలంకారంబు నకును వానిభక్తిభావంబునకును గడు మెచ్చి యచ్యుతుండు ప్రణతుండైన యమ్మాలకరిం బిలిచి వరములు గోరికొ మ్మనిచెప్పిన నాతం డాసర్వాత్మునిపై నచంచలంబైనభక్తిని భాగవతులతోడి చెలిమిని సర్వభూతదయను వరంబు లుగా నడిగినం గరుణించి హరి యాసుదామున కవ్వరములం బ్రసాదించి వంశవృద్ధిమంతంబైన శ్రీయు బలము నాయువును యశమును గాంతియుం నొసంగి యన్నతోడ నన్నగరసౌభాగ్యముఁ గనుంగొన నరిగె.

## శ్రీకృష్ణుఁడు కుబ్జదాసికి సౌందర్య మొసఁగుట.

అట్లరిగి మాధవుం డారాజమార్గంబున మైపూఁతలు నించిన పాత్రలం గొని పోవుచున్న యొకకుబ్జను గాంచి నవ్వుచు నోసుందరాంగీ! నీవెవ్వతె

వీయనులేపనం బెవ్వరియది? మాయిరువురకును మేలిమైపూఁత లిమ్ము నీకు వేగంబ మే లయ్యెడు ననిన నది యిట్లనియె. సుందరాంగా! యేను దాసిని. నా పేరు త్రివక్ర యనఁబడు. రాజునకుఁ గలపంబులు మున్నగువానిం గూర్చి నగళుల నమర్చుట నాపని. నా కూర్చుకలపంబులు కంసునిమదికి మీఁదు మిక్కిలి గూర్చు. మీయట్టివారికిఁ దక్క నిం కెవ్వరికి వీని నే నిత్తు నని పలుకుచు నాకుబ్జ కృష్ణునిరూపలావణ్యసౌందర్యమాధుర్యస్మేరాలాపవీక్షణంబులకు మోహించి రామకృష్ణులకు వలసినంతయనులేపనం బొసంగె. తమ సితాసితద్యుతులకు వ్యతిరేకంబు గావించునయ్యభినవాలేపనంబులు పూసి రామకృష్ణులు శోభాతిశయంబున వెలింగిరి. దానియెడం గరుణించి హరి తన దర్శనమునకు ఫలముగలుగ దానివక్రతం బాపఁ దలంపు గొని దాని ముంగాళులు దనపాదములం ద్రొక్కి రెండువ్రేళు లెత్తుగా గడ్డము క్రిందఁ జేయి వెట్టి మేను లేప నెత్తుటయుఁ గటివక్షఃకంఠముల మూఁడింట వక్రతం గాంచి త్రివక్ర యనం బరఁగి విరూప యైనయాదాసి వాసుదేవుఁ డెత్తి సవరించిన కతంబున నాకౌటిల్యముం బాసి ఋజుత్వంబు నొంది బృహన్నితంబ పయోధరాదిసౌష్ఠవంబునం బెంపారిన సౌందర్యమున నుల్లసిల్లి యటఁ జనుచున్న యన్నలినాక్షు నుత్తరీయంబు పట్టి పురుషోత్తమా! మాయింటికి విచ్చేయుము. నిన్నువిడువ నొల్లను. నిన్నుఁ గాంచి నీపై మనస్సు దవిలిన నన్ననుగ్రహింపు మని విన్నవించె. అవ్విధమున నయ్యది వేఁడుకొనినం గృష్ణుండు చూచుచున్న యనుచరులను బలదేవునిం గాంచి నవ్వుచు నోజవ్వనీ! వచ్చిన పనిదీర్చి యటఁ బురుషులకు మనోవ్యాధు లుడుపునీయింటికివచ్చెద. గృహరహితు లైనపాంథులకు నీవు పరమాశ్రయంబ విపుడు పొమ్మని మంచిమాటల నాదాసిని వీడుకొలిపి వణిజు లర్పించుతాంబూలంబులను జందనంబులను మాల్యంబులను బలువిధంబు లైనకానుకలనుం గ్రహించుచుఁ గృష్ణుఁడన్నయుం దాను విపణింజనుచుండఁ దదవలోకనమున మదనుఁ డుదయింపఁ దద్వి

కారమునం జేసి పౌరకాంతలు చీరలు జాఱుటయుఁ గొప్పుముడి వీడుటయుఁ
బువ్వులు రాలుటయు నెఱుంగనిపరాకునఁ జిత్రప్రతిమలట్లు లైరి.

## కృష్ణుఁడు కంసునిధనుశ్శాలలోని విల్లు విఱుచుట.

అట్లరిగి కృష్ణుండు పౌరుల నడిగి కంసునిధనుర్యాగస్థానంబుఁ దెలిసి
కొని యచ్చోటికిఁ జని యాశాలలోనికిం జొచ్చి యందు బహుపురుషరక్షి
తంబై యత్యంతపూజితంబై యింద్రచాపంబుభంగి నద్భుతంబై యున్న
యొక్క యుద్దండకోదండముం గాంచి కావలివారు వలదువలదని వారించినను
నిరాకరించి తాఁగేల నావిల్లు గొని యెక్కుపెట్టి చెఱకుగడ విఱుచుమదపు
టేనుంగుభంగి నందఱు చూడ నాకార్ముకంబు నడిమికి విఱిచె. అది విఱుఁగు
నెడం బుడమియు నాకసంబు నిండఁ బొడమినయులివునకుఁ గంసుం డదరి
పడియె. కావలివార లావిల్లు విఱుచుట కలిగి కైదువులంగొని పరివారంబు
తోడం దలపడి కృష్ణుం బట్టికొనువారై పట్టుఁడు కట్టుఁ డని యార్చుటయు
రామకృష్ణు లావింటితునియలఁ గొని వారలఁ బిలుకుమార్చి కంసుఁడు పంచిన
మూఁకలనుం దెగటార్చి యట నాశాల వెడలి నగరసౌభాగ్యంబు చూచుచుఁ
దిరుగుచుండిరి. వారి యద్భుతవిక్రమంబు నుత్సాహంబును బ్రగల్భత్వమునుం
గాంచి పురజను లద్దిరా! వీరు మానవులు గారు దేవతోత్తము లని తలంచిరి.
అట్టియెడ నాదిత్యుం డస్తగిరిశిఖరంబున కరుగుటయు రామకృష్ణులు దమ
వెంట వచ్చినగోపాలకులతోడఁ బురంబు వెలుపల బండ్లు విడిసినచోటికి కేతెం
చిరి. కృష్ణుండు నందవ్రజంబు దఱలునెడ గోపికలు తద్విరహమునకు వగ
చుచు నేఁడు మధురాపురంబువారి భాగ్యము ఫలించుననుట మున్నుగా నాడిన
మాటలు యథార్థములు గాఁగ శ్రీదేవి లాఁతుల నెల్ల విడిచి సేవించిన హరి
గాత్రసౌందర్యముం గాంచి మధురాపురవాసులకుఁ దదీయదర్శనంబు గన్నుల
పండు వయ్యె. అట్లు రామకృష్ణులు విడిదల కరిగి యందుఁ బాదప్రక్షాళనం
బొనర్చి క్షీరాన్నంబు భుజియించి కంసునితలం పెఱిఁగి యారాత్రి సుఖ
ముండిరి.

అక్కడఁ గంసుండు ధనుర్భంగము కావలివారిం బరిమార్చుట తన పంచిన సేనలఁ జంపుట మున్నగు రామకృష్ణులలీలలు విని యారేయి కన్నుఁగవంగూరుకు వారయక వనరుచు మేల్కొనునపుడు నించుక నిద్రించునపుడు నాత్మమృతి సూచించునుత్పాతంబులు పెక్కులు గనియె. మేల్కొనియున్నపుడు వానికిఁ దనశిరంబు దర్పణాదులందుఁ బ్రతిఫలించి యున్నను గాన్పింపఁబడదయ్యె. ద్వితీయరూపంబు లేకున్నను జంద్రాది తేజస్సులు ద్విరూపంబులై తోఁచె. తనప్రతిబింబంబున రంధ్రములు చూపట్టె. కర్ణపుటంబులు గప్పిన విన నగుప్రాణఘోషంబు వినంబడకుండె. వృక్షములు స్వర్ణవర్ణంబులుగాఁ గనుపట్టె. తనయడుగులు కనుపట్టకుండె. నిద్రించునెడఁ బ్రేతాలింగనము గర్దభారోహణము బిసభక్షణము నలదమాలికాధారణము తైలాభ్యంగము వస్త్రహీనత్వము మున్నగునవి తోఁచె. అట్లు స్వప్నజాగరదశలందును వివిధోత్పాతములం గాంచి కంసుండు మరణభీతుఁడై నిద్దుర గానక కుందుచుండె.

## కంసుఁడు మల్లయుద్ధరంగస్థానమునకు వచ్చుట.

అంతఁ దెలతెల వేగుటయు సూర్యోదయానంతరమునం గంసుని పంపున మల్లక్రీడామహోత్సవంబు నెఱవేర్ప నాధికారికులు దొడరి యయ్యెవారి నయ్యెపనులంబంచుటయు రంగస్థానంబున బహువిధాలంకారంబు లొప్పారె. భేరీప్రముఖవాదిత్రంబులు మ్రోసె. పతాకావస్త్రమాల్యతోరణపరిష్కృతంబులై మంచస్థానంబులు వెలసె. బ్రాహ్మణులు క్షత్త్రియులు మున్నుగాఁ బౌరజానపదులెల్లఁ దమతమ కని నియమించిన మంచెలెక్కిరి. రాజులేతెంచి తన్మంచంబు లారోహించిరి. కంసుండు మంత్రిపరివృతుండై మండలేశ్వర మధ్యస్థుండై రాజమంచ మధిరోహించి యంతర్హృదయమున వగలం బొగులుచుండె. తూర్యనాదం బెసంగ మల్లతాళధ్వనులు సెలంగఁ జాణూరముష్టిక కూటశలతోసలాదులైనమల్లవీరులు సమ్యగలంకృతాంగులై యుపాధ్యాయులతోడ నారంగస్థానంబునకుఁ జనుదెంచిరి. ఆభోజరాజునాహ్వానముం

బడసి నందగోపప్రముఖు లైనగోపాలకులు దమ తెచ్చిన కానుక లారాజు నకుఁ జెల్లించి యొక మంచెపయిం గూర్చుండిరి.

## కృష్ణుఁడు రంగద్వారమునఁ గువలయాపీడగజముం జంపుట.

భేరీనిర్ఘోషమును మల్లధ్వనులను విని రామకృష్ణులు కృతశౌచులై యా మల్లయుద్ధరంగస్థానంబునొద్దకుఁ జనుదెంచిరి. ద్వారమున మావటీఁడు పురికొలుప నడరుచున్న కువలయాపీడం బనుమత్తశుండాలముం గాంచి హరి నడికట్టు గట్టి మొగంబుపై వ్రాలినకుటిలకుంతలంబుల నవరించి హస్తిపకునిదెసం జూడ్కి నిగుడించి యోరీ! యాధోరణా! వారణముం దొలఁగించి మాకు మార్గ మొసఁగుము. ఒసంగవేని యేనుంగుతోడ నిన్ను యమపురికిఁ బంపుదు ననిపలికినం గినిసి మావంతుఁ డంతకాకారం బైన యమ్మదవారణంబును శౌరిపైఁ బురికొలుపుటయు నయ్యది రయమున నడరి తొండమునం బుండరీకాక్షుం బట్టికొనియె. దానిపట్టు దప్పించుకొని కృష్ణుండు దానిం దన్ని యగపడకుండ దానికాళులక్రింద నణఁగి డాఁగె. అందుల కలిగి యయ్యేనుం గిటునటుం జూచుచుఁ గృష్ణుని యున్నచోటరయ నేరక వాసనఁబట్టి శుండాదండమునం బట్టఁబోయినం గోపాలబాలుండు బలాత్కారమున నట వెనుకకు నడచి పన్నగంబును గరుడుం డెట్లు లట్టు లయ్యేనుఁగు తోఁకఁ బట్టి యిరువదేనువిండ్ల కొలందికి లాఁగి యయ్యది డాఁపలించినం గేశవుండు వలపలించియు నయ్యది వలపలించినం దాను డాఁపలించియుఁ గ్రేపుతోడ నాడు గోపబాలునిలీల నొప్పుచు నవ్వేదండంబు నాడించుచుఁ దొలంగి యటఁ జక్కసరిగాఁ బాఱుతెంచి కరతలంబున నాగంధద్విపంబు నడిచె. అడిచిన నయ్యేనుంగు రోషమునం గాలఁ దాఁచుటయు నాతాఁకు దప్పించికొని వనజాక్షుండు నేలకు వ్రాలె. అది కృష్ణునిపాటుగాఁ గొని యాకరివరంబు క్రోధోద్ధతిం గొమ్ములం గ్రుచ్చునంతలో శ్రీకాంతుండు దొలంగినం దానికొమ్ములు నేలం గ్రుచ్చికొనియె. అట్లు దనవిక్రమంబు ప్రతిహతం బైనం గనలి యాకుంజరంబు మావంతులు పురికొలుపఁ జేర్చి

దామోదరుం డాఁకుటయు నమ్మహామహుండు దనకరంబున దానిశుండాదండముం బట్టి నేలం బడఁ ద్రోచి పైకుఱికి సింహవిక్రమంబున మెఱయుచుఁ దదీయదంతముం బెఱికి దాన నాదంతావళంబు నడిచి మావంతులం గూల్చి యయ్యేనుఁగుపీనుఁగును విడిచి నేలకు లంఘించి తద్గజదంతముఁ గేలం బూని నిలిచె.

## రామకృష్ణులు మల్లరంగముఁ బ్రవేశించుట.

అవ్విధంబున మధుసూదనుండు కువలయాపీడనామకం బైనమత్తమాతంగముం జంపి దానిదంతము మూఁపుపై నమర్చి తదీయమదరుధిరబిందుసందోహసంకలితగాత్రుండై చెమర్చినమోముదమ్మితో నుల్లసిల్లి యన్నయుఁ దానును గోపాలురు గొందఱు వెంట బెరసి యరుదేర మల్లవీరులకుఁ బిడుగై పురుషులకుఁ బురుషోత్తముఁడై సుందరులకుఁ గందర్పుఁడై గోపాలురకు బాంధవుఁడై యసద్రాజులకు శాసకుఁడై దల్లిదండ్రులకు బిడ్డయై కంసునకు మృత్యువై యవిద్వాంసుల కపర్యాప్తుఁడై యోగులకుఁ బరతత్త్వంబై యాదవులకుఁ బరదేవతయై తోఁప నారంగస్థానంబుఁ జొచ్చె. కువలయాపీడముం జంపుట వినియు నారామకృష్ణులమూర్తిశోభావికాసంబుఁ గాంచియుఁ గంసుఁడు ధీరుఁడయ్యు నుద్వేగంబు నొందె. విచిత్రవేషభూషణమాల్యాంబరంబులఁ గైసేసికొని రంగముఁ జొచ్చినయమ్మహాభుజు లిద్ద ఱుత్తమవేషముల ధరించిననటులరీతిం జూడ నొప్పి చూపఱడెందముల నాకర్షించుచున్నంత మంచాంతర్గతు లైననాగరజానపదరాజు లందఱు ప్రహర్షోత్కర్షభరితలోచనంబుల వారిం గ్రోలునట్టులును జిహ్వను లేహనంబు సేయునట్టులును నాసికంబుల మూర్కొనునట్టులును బాహువులఁ గౌఁగిలించుకొనునట్టులునుం బుబ్బనచూఱగాఁ జూచి యేప్రొద్దునకుం దనియక తదీయరూపగుణమాధుర్యప్రాగల్భ్యములు దమ్ముఁ దలఁపించి నట్లుపోలె విన్నదానికిఁ దక్కువగానివారిరూపమహిమంబులకు విస్మితులై తమలో నిట్లనిరి. బళే వీర లిరువురును సాక్షాన్నారాయణుని యంశమున వసుదేవునింట నవతరించినవారలు. ఈకృష్ణుండు

దేవకీగర్భమునం బుట్టినవెంటన నందవ్రజమునకుఁ దోడికొనిపోవ నచ్చట నిందాఁక గూఢముగఁ బెరిగె. ఇతండు బాల్యముననే పూతనం జంపె. తృణావర్తుం బరిమార్చె. మద్దిమ్రాఁకులఁ గూల్చె. ధేనుకుం దెగటార్చె. కేశిం బిలుకుమార్చె. శంఖచూడుని బోలియించె. మఱియుఁ బలువుర నట్టివారలం దెగఁజూచె. గోవులను గోపాలురనుం గార్చిచ్చువలనం గాచె. కాళియనాగుని మద మడంచె. ఏడునాళ్లు కొండ యొక చేత నెత్తి వహించి వర్షవాతాశనిబాధ గలుగకుండ గోగోపగణములం గాచి యింద్రుని యహంకారము హరించె. స్మేరవీక్షణవిలాసభాసురం బైనయీవాసుదేవువదనముం గాంచి నిత్యము గోపికలు వివిధతాపములఁ బాసిరి. ఇమ్మహానుభావునిప్రాపును బ్రోపును గాంచి యదువంశము శ్రీకీర్తిమహత్త్వములం బడసి లోకవిఖ్యాతం బయ్యెడు నని పెద్దలు పలుకుదురు. కమలలోచనుం డైనయీరాముఁడీమహాత్ముని కన్న. ఇతండు ప్రలంబ వత్సక ధేనుకాదులం బొరివుచ్చె నని ప్రశంసించుచుండిరి.

## కృష్ణుఁడు రాముఁడును జాణూరముష్టికాదులగుమల్లులఁజంపుట.

వార లట్టులు ప్రశంసించుచుండఁ దూర్యఘోషంబు పెలుచ నెసఁగుచుండఁ జాణూరుండు రామకృష్ణుల కభిముఖుండై యోనందనందనా! యోరామా! మీరలు వీర్యవంతులు బాహుయుద్ధనిపుణులునని విని యీరాజు మిమ్ముఁ బిలపించె. మనోవాక్కాయకర్మంబుల రాజునకుఁ బ్రియము సేయువారు మేలొందుటయు విపరీతవర్తనులు సెడుటయు నెల్లవారికిం దెల్లంబు. గోపాలురును వత్సపాలురును వనంబులందు గోగణంబుల మేపుచు మల్లయుద్ధమునం గ్రీడింతురుగదా? కావున మల్లయుద్ధము నేర్చినమీరు నేమును గూడి రాజునకుఁ బ్రియంబు సేయుదము. సర్వభూతమయుఁ డైనరాజు ప్రీతుఁడైన నఖిలభూతములును మనకుఁ బ్రసన్నంబులగు ననిన నవ్వచనముఁ బ్రశంసించుచుఁ గృష్ణుండు చాణూరునకు దేశకాల సందర్భోచితంబుగా నిట్లనియె. అయ్యా! బాహుసమరంబు మాకును సమ్మతంబు. వనములఁ

ఐరుగు నేము నీభోజపతియేలుబడికి లోఁబడినవారము కావునఁ దత్ప్రియా చరణంబు మాకుం గర్తవ్యంబు. అయ్యదియే మాకుఁ బరమానుగ్రహంబు. ఐన నేము బాలురము గావున మాయీడువారితోడం బోట్లాడు టుచితంబు. బాహుయుద్ధమున మల్లసదస్యుల కధర్మంబు దొడరఁ జనదుకదా యనుటయుం జాణూరుఁ డయ్యా! నీవును బలుఁడును బాలురుగారు. కుంజరసహస్రబలవంతం బైనకువలయాపీడమును నీ వవలీలం గూల్చినప్పుడే నీ బాలత్వం బేర్పడియె. కావున మీరు బలియురతోడం బోట్లాడఁ జాలుదురు. ఇందేమియు నన్యాయంబు గనుపట్టదు. నీవు నాతోడఁ బెనంగుము. ముష్టికుండు బలుని తోడం బోటులాడువాఁ డని నిరూపించె. చాణూరవచనంబు విని కృష్ణుం డాత్మసంకల్పానుగుణంబుగా వాఁడు వలికెనని తనలోఁ దలంచి వల్లెయని చాణూరుని మాఱుకొనియె. రాముఁడు ముష్టికుని దలపడియె. అట్లు కృష్ణుఁడు మల్లవీరుం డైనచాణూరుని మార్కొనుటయు నయ్యిద్దఱు చేతులు సఱచియుఁ దొడ లప్పళించియుఁ బలుమాఱులు దొలంగియుఁ గదిసియుఁ గవిసియుఁ జేతులఁ జేతులను బాదములఁ బాదములను బరస్పరవిజిగీషామనీషం బెనంగియు నీడ్చియు మోఁచేతుల నొండొరుల మోఁచేతులను మోఁకాళ్ల నొకళ్లొకళ్ల మోఁకాళులను దల నితరేతరశిరంబును ఱొమ్మున నన్యోన్యవక్షంబును నడిచియుఁ బ్రెక్కణంబుఁ గలయం గ్రుమ్మరియు ముందరికి నెట్టియు భుజములం బట్టు పట్టియుఁ గ్రిందఁ ద్రోచియు ముందరికిఁ దొలఁగం బాఱియుఁ బిఱిందికి నడచియుఁ గ్రింపఁ బడునెడఁ గాళులు మోఁకాళులు ముడియ గట్టి నేలతో వ్రేసియు నట్టివానిం జేతులఁ బై కెత్తి యేసియు నేచి మెడఁ బట్టికొనినం దప్పించికొని త్రోచియు నేల నదిమి కాలుసేతులు సేర్చి ముడియ గట్టియు నొండొరులకు మీఱి యయ్యిద్దఱును దద్దయుం బోక పెనంగుచున్నంత బాలురకును బలవంతులకును బ్రవృత్తంబైనయీ పోట్లాటం జూచి వేడుక సూడ వచ్చినవెలందు లందఱును గారుణ్యా మేపారఁ దమలో నిట్లనిరి. కేవలబాలకులను బలియు రగుమల్లులతోడిపోట్లాటకుఁ

జొనిపి వేడుక సూచుచున్నయీరాజసదస్యుల యధర్మం బింత యగునే? వజ్రసారంబులై నడగొండలు వోలె నుండు దృఢగాత్రముల నొప్పునీజెట్టి మానుసు లెక్కడ? జవ్వనమురాని యతిసుకుమారు లైనయీబాలకు లెక్కడ? నిక్కం బీసమాజమున ధర్మము విపరీతం బయ్యె. అధర్మం బెందుఁ బొడమునం ద్రొక్కింతతడవైన నిలుపం జనదు. సభికులదోషములు దెలియ వచ్చినం బ్రాజ్ఞున కాసభకుఁ బోవఁ దగదు. సభలోఁ గలిగినదానిం జెప్పకున్నను విపరీతముగఁ జెప్పినను నరుండు కిల్బిషంబుఁ గుడుచు. శత్రునియెదురఁ దిరుగుకృష్ణుని నెమ్మొగమ్ము గంటిరే జలబిందుపరీతం బైనసరోజంబుచాడ్పున స్వేదబిందుసందోహసాంద్రం బయ్యె. అయ్యదియె యరుణలోచనాభిరామం బైన బలదేవవక్త్రము దన్ను మార్కొన్నముష్టికునిపై నలుక యాదరహాససంరంభశోభనం బై యొప్పుచున్నది. శంకరాద్యర్చితపదుం డైన యీ పురాణపురుషుఁడు నరవేషప్రచ్ఛన్నుఁడై వనములఁ జిత్రమాల్యముఁ దాల్చి వేణుగానంబు సేయుచు గోవుల మేపుచుఁ జరించుటం జేసి బృందావన భూములు పరమపావనంబు లయ్యె. లావణ్యసారంబై నిస్సమాధికంబై యనన్యసిద్ధంబై శ్రీనివాసంబై యితరదురాపం బైనయియ్యీశ్వరునిరూపముం బ్రతి సమయమునం గన్నులఁ గ్రోలఁగ గోపిక లేమితపంబు సలిపిరో. పాఁడిపితుకుట వడ్లు దంచుట మదనోద్దీపకంబు లైనపూఁతలు గూర్చుట యుయ్యేల లూఁగుట యేడ్చుబాలురను బుజ్జగించుట తరుజలసేచనంబు సేయుట నీరు చల్లుట మున్నగుపనులు సేయుచుండియు వలపునం జిత్తము కృష్ణునిపైఁ జేర్చి కన్నుల నానందజలమ్ములు గ్రమ్ముదేరఁ దత్కీర్తింబాడుదురు. ప్రాతఃకాలమున వ్రేపల్లియనుండి గోగణంబులఁదోలుకొనిపోవునెడను సాయంకాలమున వనము నుండి గోకులంబునకు వచ్చునెడను దదీయరమణీయవేణునాదంబువిని యాగోప కాంతలు రయంబున నిల్లు వెడలి పఱతెంచి స్మేరకరుణావిలోకనమున సొంపారు తద్వదనారవిందముఁ గనుంగొన నెంతపుణ్యముఁ జేసియుండిరో యని యవ్వనితలు దమలోఁ బలుకుచున్నంత యోగేశ్వరుం డైనహరి యరిం బోరి

మాల్పఁ జిత్తంబునఁ దలంచె. అన్నెలఁతలపలుకులు విని తల్లిదండ్రులు కొడు కులబలిమి యెఱుంగక పుత్త్రస్నేహమునం జేసి యడలిరి. అవ్విధంబునఁ జాణూ రుఁడును గేశవుఁడును ముష్టికబలరాములును వివిధబాహుయుద్ధభేదంబు లేర్పడ నీడంబోక పెనంగుచున్నంతఁ బిడుగుపాటునకు సాటివచ్చునచ్యుతు పోట్లకు మేనెల్ల నలిగులియగుటయుఁ బెద్దయు నొచ్చియుఁ జాణూరుండు పోటుమానిసి గావునఁ జలంబు నెఱయ బలంబు మెఱయఁ దొలంగి డేగచాడ్పున మీఁది కెగసి యట వడిం ద్రెచ్చి వచ్చి రెండుచేతులం గూర్చి యొక్కపిడికిలిగా నమర్చి దాన దానవాంతకునురమ్ము బిట్టు గొట్టె. మదవేదం డంబు పూదండతాఁకు నెట్లట్లు తత్ప్రహారంబు సరకుగొనక చలింపక చలంబు డింపక హరి యాజెట్టిబాహువులం బట్టి నిగ్రహించి పలుమాఱులు గిరగిరం ద్రిప్పి నేలతో విసరివైచి క్రిందం బొరలించి నలఁగించిన నమ్మల్లుండు వెల్లుగఁ దల్లడిల్లి విస్రస్తభూషణకేశమాల్యుండై విగతజీవితుండై యింద్రధ్వజంబు చాడ్పునం గూలె. అట ముష్టికుం డేచి గాఢముష్టిప్రహారంబున బలదేవుని నొంచుటయు నారౌహిణేయుండు డలిగి బలిమిమై నఱచేతఁ దన్నుటయుం నతండు నోరనెత్తురుగ్రక్కుచుఁ బ్రాణములం బాసి పెనుగాలికిఁ బాదపంబెట్టు లట్టులు నేలంగూలె. అందులకుఁ గోపించి కూటుఁడు రాముని శలుఁడు తోసల కుఁడుం గృష్ణుని మార్కొనుటయుం బలుండు కూటుం బిడికిటఁ బొడిచి యవ లీలం జంపె. హరి కాలఁ దలలు దన్ని శలతోసలకులం బిలుకుమార్చె. అట్లు చాణూరముష్టికకూటశలతోసలకులు చచ్చినం దక్కినమల్లులెల్లఁ బ్రాణభీతిం బఱచిరి. అట్టియెడ రామకృష్ణు లాత్మవయస్యులైన గోపాలురం గూర్చుకొని యారంగంబున వాదిత్రనాదంబు ప్రవర్తిల్లుచుండ నూపురరవంబు తాళలయా నుగతి నభిరామంబై యెసంగ విలాసనృత్యంబు సేయుచు విహరించుటయు వేడుకచూడ వచ్చినబ్రాహ్మణాదిజనులు కంసుఁడొక్కండు దక్కఁదక్కిన వారెల్ల మేలుమేలని యయ్యాట మెచ్చుచు నెమ్మనమ్ముల సమ్మదమ్ము నొందిరి. మల్లవీరులలోనం బ్రధానులు హతు లగుటకును దక్కినవారు వెఱచిపఱచు

టకును మనం బడలం గంసుండు వాద్యవాదనంబు వారించి యాత్మభటుల
చెన మొగంబై దుర్వృత్తులైనయీవసుదేవసుతులం బురంబు వెడలంగొట్టుండు.
గోపాలురధనమెల్ల నపహరింపుండు. దుర్మతి యగునందగోపుని బంధింపుండు.
అసాధుతముండు దుర్బుద్ధియు నగువసుదేవుని బరపక్షపాతి యగునాతండ్రి
నుగ్రసేనుని దదనుసారులను వేవేగ వధింపుం డని యాజ్ఞ చేసె.

## శ్రీకృష్ణుండు కంసుని సంహరించుట.

అక్కరణిం బెక్కులు ప్రేలునక్కొవ్వుం డైనయక్కంసునిపైం బెద్దయు నలిగి యవ్యయుం డైనహరి తదారూఢరాజమంచముమీఁదికి లాఘవంబున లంఘించుటయుం మృత్యువుపోలెఁ దనమీఁది కురువడించి యేతెంచు నచ్యుతుం గాంచి కంసుండు దటాలున లేచి ధీరంబున వాలుం బలకయుం గొని యనికి సమకట్టె. మింటం దిరుగు డేగపగిదిం దన్నుం దప్పించికొన డాంపలికి వలపలికిం దొలంగుచుం బాయుచుం జేతివాలు జళిపించుచున్న ఖలపాంసనుం డైనకంసునిం గృష్ణుండు పన్నగగ్రహణవ్యగ్రుం డైనగరుడుని వడువున నుగ్రతేజంబున మెఱసి వడిం జేర్చి పట్టుకొని కిరీటంబు పడం దన్ని సిగం బట్టికొని యయ్యున్నతమంచమునుండి రంగమునం బడం దటాలునం ద్రోచి యేచి వానిమేను గులగులలుగాఁగ నాత్మతంత్రతం దాను వానిపయిం బడి పొరిమాల్చి యేనుంగు నీడ్చుసింగముభంగి నాకంసునిపీనుఁగు నీడ్చుటయు నారంగమున నెల్లజనులహాహానినాదం బెసంగి నింగి ముట్టె. కంసుం డెల్లప్రొద్దును దినుచుం ద్రావుచు నడచుచుం గూర్చుండుచు శ్వాసము విడుచుచు నుద్విగ్నచిత్తంబునం జక్రాయుధుం దలంచుచుండినకతంబున నయ్యీశ్వరుసారూప్యంబుం బ్రాపించె. కంసునిచావు విని వానితమ్ములు కంకన్యగ్రోధకాదు లెనమండ్రు దీండ్రించునలుకతో నన్నఋణము దీర్చువారై యొక్కయుమ్మడిం దాఁకుటయు బలరాముఁడు పశువిశసనోదగ్రుం డైనమృగేంద్రంబుపోఁకం జేర్చి యచ్చట నున్నయినుపగుదియఁగొని యయ్యాతిరభసోద్యతుం బిలుకుమార్చె. అప్పుడు దివంబున దేవదుందుభులు మొరసె.

బ్రహ్మేశాదులు పుష్పవృష్టిం గురిసి రామకృష్ణులం బ్రశంసించిరి. సురసుందరులు నృత్యం బొనర్చిరి. కంసపత్నులును దద్భ్రాతృభార్యలును మగలచావునకుం బెన్వగలం బొగులుచుం గన్నీరు జాలువాఱం దలలు వగుల నడిచికొనుచు నచ్చటికి వచ్చి వీరశయనంబునం బడియున్న పతులపయింబడి కౌఁగిలించికొని యెలుంగు రాల్పడ నిట్లని పలవించిరి. ఓప్రాణనాథా! యోప్రియతమా! యోధర్మజ్ఞా! యోకరుణామయా! యోదీనవత్సలా! నీవు చచ్చుటం జేసి యేమును గృహములతోడం బ్రజలతోడం జచ్చినవార మైతిమి. పతియగునిన్నుం బాసి యీనగరి మాయట్లపోలె నుత్సవమంగళంబు లుడిగి శోభింపకుండెడు. తప్పు సేయనిభూతములకు ద్రోహము సేసినదాన నీ కిట్టిదశం బడయ వలసె. భూతములకుం గీడు రోసి యెవ్వం డివ్విశ్వమున మేలొందు? ఈకృష్ణుండే సర్వభూతములయుత్పత్తికిని బాలనమునకును సంహారమునకుం గారణంబు. అట్టి మహాత్మున కెగ్గు చేసినవాఁ డెన్నఁడైన నెక్కడనైన సుఖముం బడయ నేర్చునే యని రాజమహిళలు రోదనంబు సేయుటయు లోకేశ్వరుండైన కృష్ణుండు వారల నూరార్చి కంసునకును వానితమ్ములకునుం గ్రమంబునం బరలోకక్రియలు సేయం బనిచె.

## రామకృష్ణులు దేవకీవసుదేవులం గని యూరార్చుట.

అంత నయ్యదుకుమారులు దల్లిదండ్రులైన దేవకీవసుదేవులకుం గంసకృతబంధంబు దప్పించి తదీయపాదములపై నాత్మశిరంబులు సోఁకం జాగిలంబడి మ్రొక్కుటయు రామకృష్ణు లీశ్వరు లనుతలంపున శంకించి యాజననీజనకులు వారిం గ్రుచ్చి కౌఁగిటం జేర్చి దీవించు టుడిగిరి. అట్టియెడం బురుషోత్తముం డౌరా! వీర లిప్పుడే పరమార్థం బెఱింగి రియ్యది ప్రకృతకార్యవిడంబనంబున కనువుగా దని తమలో నూహించి సకలజనసమ్మోహనంబైనయాత్మమాయాయోగంబు వారిపయిం బరఁగించి యన్నయుం దాను వారిచేరువకుం జని వినయమునం దల వాంచి యోయమ్మ! యోనాయనా! యని పిలిచి ప్రీతి పుట్టించుచు నిట్లనియె. తండ్రీ! మామీఁద నిత్యోత్సుకత్వంబు

గలిగియున్నను మీకిరువురకు మాబాల్యపౌగండకైశోరక్రీడలుచూడ వలనుగా
కుండె. లోకమునఁ దండ్రియింటనుండి బాలురు వారిలాలనలం బడసి ముద
మొందుదు రాభాగ్యంబు మాకు లేకుండె. సర్వార్థసాధనం బైనదేహ మెవ్వరు
గని పెంచఁబెంపుగాంచు నాతల్లిదండ్రులఋణమును మర్త్యుండు నూఱేండ్ల
కైనం దీర్పఁజాలఁడు. సమర్థుఁడయ్యుఁదల్లిదండ్రులకు దేహమునను ధనమునను
వృత్తిఁ గల్పింపనిపుత్త్రుని యమభటులు పరలోకమున నిజమాంసముఁ దినిపిం
తురు. తల్లిని వృద్ధగుతండ్రిని బతివ్రత యగుభార్యను బాలుఁడైన పుత్త్రుని
గురువులను దన్నాశ్రయించినబ్రాహ్మణుని సమర్థుఁడయ్యు భరింపనిపురుషుఁడు
జీవన్మృతుఁ డనంబడు. కంసునకు వెఱచి యసామర్థ్యమున మీకుఁ బరి
చర్య సేయక యిన్ని నాళ్లు వ్యర్థముగఁ గడపితిమి. శత్త్రుపీడ నలజడిపడుమీ
కింతకాలము పరాధీనతానిమిత్తమున శుశ్రూష గావింపనిమాతప్పు సైరింప
వలయు నని యిట్లు మాయామానుషవేషుఁ డైనయవ్విశ్వాత్ముండు దెల్పిన
నమ్మాటలకు మోహ మొంది దేవకీవసుదేవు లాకుమారులఁ గౌఁగిటం గ్రుచ్చి
ముదం బంది కొడపయిం గూర్చుండఁ బెట్టుకొని యానంద బాష్పములఁ
దన్మస్తకంబులఁ దడుపుచు స్నేహపాశసమావృతు లై బాష్పనిరుద్ధకంఠులై
యేమియుం బలుక నేరక మిన్నకుండిరి.

## శ్రీకృష్ణుఁ డుగ్రసేనుని రాజ్యమున నియమించుట.

అట్లు తల్లిదండ్రుల నూఱడించి దేవకీనందనుండు మాతామహుఁడైన
యుగ్రసేనుని రాజుం జేయఁ దలంచి యతనిదెసం జూడ్కి నిగుడించి యిట్ల
నియె. మహారాజా! నీప్రజలైనమాకుఁ బని పంపుము. యయాతి శాపమున
యాదవులకు రాజ్యాసనం బారోహింపరాదు. కావున నేము దాని కనర్హు
లము. ఏను భృత్యుఁడనై కొలుచుచుండుటంజేసి దేవాదులు వినమ్రులై
నీకు బలి యర్పింతురు. తక్కినరాజులఁ జెప్పనేల యని చెప్పి యుగ్రసేనుని
రాజ్యాసనం బారోహింప నొడంబఱిచి యనిలుం బిలిచి యయ్యా! నీ వేగి

సుధర్మాభిధానం బైనయింద్రసభ నీరాజునకుఁ దెచ్చి యిమ్మని యానతిచ్చె. పని విని పవమానుం డరిగి యయ్యర్థ మాఖండలునకుఁ జెప్పుటయు దేవపతి కృష్ణప్రభావం బెఱింగినవాఁడు గావున దాని నిచ్చినం దెచ్చి మారుతుం డర్పించినం గృష్ణుఁ డం దుత్తమాసనంబున నుగ్రసేను నాసీనుం జేసి రాజభావమునం బూజించె. కంసునకు వెఱచి నానాదేశములకుఁ బఱచినయదువృష్ణికుకురాంధకాదు లైన స్వజనుల రావించి సత్కరించి బహుధనంబు లొసఁగి వారిం దమతమయావాసంబుల నివసింప నియమించె. కృష్ణసంకర్షణభుజబలగుప్తులై యాదవులు దుఃఖములం బాసి లబ్ధమనోరథులై ప్రతిదినము సదయస్మేరవీక్షణవిలాససముదంచితంబై నిత్యప్రముదితం బైనముకుందవదనారవిందముఁ గనుంగొనుచుఁ గృతార్థులై రమించిరి. ముకుందముఖారవిందామృతముఁ గ్రోలుటం జేసి వారు వృద్ధులయ్యుఁ బ్రాయముం బడసి యతిశయితబలతేజంబులఁ బెంపు గాంచిరి. అట రామకృష్ణులు నందునొద్దకుఁ జని యాగోకులపతిం గౌఁగిలించికొని యిట్లనిరి. తండ్రీ! నీవును యశోదయుం మమ్ము స్నేహమునం బెంచి లాలించితిరి. తల్లిదండ్రులకుఁ బుత్త్రులమీఁది ప్రేమం బాత్మశరీరప్రీతికంటె నధికంబు. ప్రోచి పెంచఁగ నసమర్థులైనబాంధవులు విడిచినబాలురం దమకన్నబిడ్డలట్లపోలెఁ బెంచినవారకదా తల్లిదండ్రులు? తాతా! మీరు వ్రేపల్లియకుఁ జనుఁడు. ఏమిచ్చుట సుహృదులకు సుఖముఁ గావించి మామీఁది స్నేహమున విరహవిహ్వలులై యుండుస్వజను లైనమిమ్ముఁ గనుంగొన వత్తు మని ప్రణయభాషితంబుల నుపలాలించి వస్త్రాలంకారధనకనకాదు లొసఁగి సాదరముగ సత్కరించుటయు నందుఁడు ప్రణయవిహ్వలుండై వారిం బలుమాఱులు గౌఁగిలించుకొని కంట దడి వెట్టుచు వారి నెల్ల వీడుకొని గోపాలురతోడ మగిడి వ్రేపల్లియ కరిగె.

## రామకృష్ణు లుపనీతులై విద్యాభ్యాసంబు సేయుట.

అట వసుదేవుఁ డాత్మనందనులైన రామకృష్ణులకు బ్రాహ్మణపురస్కృతుం డైనపురోహితుం డగుగర్గాచార్యునిచే ద్విజోచితం బైన యుపనయనసంస్కారము శాస్త్రోక్తవిధానమునఁ జేయించి యయ్యుత్సవంబున విప్రులం బూజించి యలంకరించి సవత్సాలంకృతగోసహస్రంబుల దక్షిణగా సమర్పించె. మఱియు నాకుమారులజన్మసమయమునం దాను మనంబున నొసంగిన వానిం గంసుం డధర్మమున నపహరించికొనుటయు వానినెల్లఁ గ్రమ్మఱ రాజకీయగోష్ఠమునుండి తెప్పించి యన్నింటి నొసంగె. అవ్విధంబున నుపనయనసంస్కారముం బడసి రామకృష్ణులు ద్విజులై గర్గునివలనం గాయత్రి గ్రహించి బ్రహ్మచారులై సర్వవిద్యాధారులయ్యు సర్వలోకేశ్వరులయ్యు సర్వజ్ఞులయ్యు ననన్యసిద్ధనిర్మలనిజబోధము నరవేషమున దాఁచినవా రవుటం జేసి లోకవిడంబనార్థంబు గురుకులవాస మొనర్పఁ బూని కాశీపురికిం జని యం దవంతీపురవాసియైనసాందీపనుఁ డనువిద్వాంసు నాశ్రయించి పరమభక్తిభరితంబుగ నుపాసించిరి. శమదమసమన్వితు లైనయాశిష్యులసేవకును శుద్ధభావానువర్తనంబులకును సుప్రీతుండై యయ్యుపాధ్యాయుఁ డఖిలవేదములను వేదాంతములను వేదాంగములను సరహస్యం బైనధనుర్వేదంబును ధర్మశాస్త్రమును మీమాంసామార్గంబులను దర్కవిద్యను షాడ్గుణ్యసముదంచితం బైనరాజనీతినిం జెప్పె. సర్వవిద్యాప్రవర్తకు లైనయాబ్రహ్మచారులొక్కతూరి చెప్పినమాత్రన వానినెల్ల నాగురువుతోడఁ జదివి నేర్చికొని యఱువదినాలు గహోరాత్రములఁ జతుష్షష్టికళలు గ్రహించి యయ్యాచార్యుం గొలిచి మహాత్మా! గురుదక్షిణయేమి సమర్పింతు మని వేఁడిరి. ఆశిష్యుల యద్భుతమహిమంబునతిమానుషం బైనమతివిలాసంబునుం బరికించి యయ్యాచార్యుండు భార్యతో నాలోచించి యంతకుమున్నొకఁడో ప్రభాసక్షేత్రంబున సముద్రమునం బడి చచ్చిన తనసుతుని దెచ్చి దక్షిణగా నిమ్మని చెప్పె.

అందులనువల్లెయని యనివార్యవిక్రములైన యమ్మహారథులు రథ మధిరోహించి ప్రభాసమునకుఁ జని సముద్రతీరమున నించుక కూర్చుండుటయు సాగరుండు వారి నీశ్వరులఁగా నెఱింగి పూజోపకరణములతోడ నేతెంచి పూజించె. ఆపూజలం గ్రహించి భగవంతుఁ డయ్యా! బాలుఁ డైనమాగురు పుత్త్రుఁడు భవత్కల్లోలమాలికాగ్రస్తుండై నీలో నుండెను. వేగ వానిం దెచ్చి యిమ్మని యడుగుటయు సముద్రుఁ డో మహాత్మా! యే నతని హరింపను. మఱి పంచజనుఁ డనుశంఖరూపధారి యైనయసురుఁడు మీగురుపుత్త్రుని హరించె. అయ్యసుర నాయంతర్జలంబున నుండెడు జలము సొచ్చి వానిం దెగటార్చి గురుపుత్త్రుం గ్రహింపు మని విన్నవించె. కృష్ణుండు బలదేవుతోడ రయమున నుదధిజలంబు సొచ్చి యాలోపల నున్న యాదానవుం జంపి వానియుదరంబుఁ జీల్చి యం దయ్యర్భకుం గానక యాకుమారుఁడు మృతుఁడై యమలోకమునకుఁ బోయియుండు నని నిశ్చయించి యాదానవు మేనం బుట్టి పాంచజన్య మనం బరఁగునుత్తమశంఖముం గ్రహించి యమనివాసం బైనసంయమనీపురి కరిగి శంఖ మొత్తె. శంఖనిర్ఘోషంబు విని యముఁడు దటాలున నెదురువచ్చి భక్తిబృంహితముగా రామకృష్ణుల కుత్తమపూజఁ గావించి వినయవినమ్రుండై కృష్ణుని మొగమునం జూడ్కి నిలిపి దేవా! లీలామానుషులైన నారాయణమూర్తులగు మీ కేమిపని సేయుదు నని యడుగుటయు దేవకీనందనుం డిట్లనియె. నిజకర్మనిబంధనంబున నస్మద్గురుపుత్త్రుం డిటకుఁ దేఁబడియె. మదీయశాసనంబున నాతనిం దెచ్చి యిమ్మని నిర్దేశించిన విని యముఁడాసాందీపనతనయు నాత్మలోకమున నున్న వానిం దెచ్చి యిచ్చె. అకుమారునిఁ దోడితెచ్చి రామకృష్ణు లాచార్యున కర్పించి యింక నేమి దక్షిణ దెచ్చి యర్పింతు మని యడిగినం గురుండు వారి కిట్లనియె. వత్సలారా! మీ రిరువురు మంచిగురుదక్షిణ యొసఁగితిరి. మీయట్టిశిష్యులం బడసినగురువునకు నెఱవేఱనికోర్కియుం గలుగునే? వీరులారా! నిజగృహంబులకుఁ జనుఁడు, మీకీర్తి జగత్పావనంబై యొసంగెడు మనిచెప్పిన నయ్యాచార్యుని

వీడుకొని యావసుదేవనందనులు రథ మెక్కి పర్జన్య నినదోపమం బైన నేమి ఘోషంబుతో మధురాపురంబునకుఁ జనుదెంచిరి. పౌరజనులు రామకృష్ణులం గాంచి యంతకుమున్ను పెక్కు నాళ్లు వారి నెడఁబాసినవారు గావునఁ బోయినసొమ్ము దొరికిన నెట్టు లట్టులు పరమానందమునం బొదలిరి.

## కృష్ణుఁ డుద్ధవుని వ్రేపల్లెకుశల మరయఁ బంపుట.

అంత నొక్కనాఁడు వృష్ణికుల ప్రవరుండు మంత్రాలోచననిపుణుండు బృహస్పతిశిష్యుండు బుద్ధిమద్వరిష్ఠుండు దనకుఁ బ్రియసఖుఁ డేకాంత భక్తుఁడు నగునుద్ధవుం బిలిచి భగవంతుండు ప్రపన్నార్తిహరం బైనతనకరం బున నతనిచేయి పట్టుకొని యిట్లనియె. సౌమ్యా! యుద్ధవా! వ్రేపల్లియకుఁ జని మాతల్లిదండ్రు లగుయశోదానందుల కానందము గ్రందుకొలుపుము. న న్నెడఁబాసినగోపికల కయ్యలమట నామాటలఁ దేర్పుము. వారు నాతదర్థంబు పతిపుత్త్రబాంధవాదులం బరిత్యజించి యేన తమకుఁ బ్రాణమనియుఁ బ్రియతముఁడనియు నమ్మి నెమ్మనమ్మున న న్నె యాత్మునిఁగా నెంచియున్నారు. నాతదర్థంబు లోకధర్మములఁ ద్యజించిన వారి నేను భరింతును. దవ్వున నున్నపరమప్రియతముఁడైన న న్నెడఁబాసి యెంతయు నుత్కంఠతో న న్నే తలంచుచు నాగోపకాంతలు మోహ మొందియు నేను వ్రేపల్లియ వెడలు నెడం జెప్పినమాటల నమ్మి మదాత్మికలై యెట్టులో యింతకు మేనఁ బ్రాణములఁ దాల్చియుండుదు రని యాన తిచ్చుటయుం వల్లెయని యుద్ధవుండు తత్క్షణంబ భర్తృసందేశముం గొని తే రెక్కి నందగోకులంబునకుఁ దఱలె. తఱలి పడమరఁ బ్రొద్దుగుంకుతఱిఁ బసులు మందకు మగిడి వచ్చునంత కెద రైనయావులఁ గట్టఁ గడంగి యొండొంటితోడఁ బోట్లాడు నాఁబోతుల సమ్మర్దమున నిఱుకటంబై దవ్వుదవ్వులఁ గ్రేపులం గాంచి పొదుఁగు వ్రేగునం బాఱుతెంచు లేఁగటియావులపరువులఁ బరిష్కృతంబై యిటునటుఁ బల్లటీ ల్లనుచుఁ బఱచు తెల్లనిక్రేపుల నభిరామంబై పాఁడిపితుకు నెడం బొడము

నులివున లలితంబై గోపబాలకులవేణుగానరవమున రమణీయంబై రామ కృష్ణలీలలం బాడుచున్న యలంకృతగోపగోపికాసమాజముల మనోరమంబై సూర్యానలాతిథిపితృదేవార్చనలం బరంగించుధూపదీపమాల్యంబుల క్రొత్తావుల నలరుగోపమందిరంబుల సుందరంబై చుట్టు నున్నయుద్యానవనంబులలోని తరులతానికరములం బూచినవిరులకమ్మతావుల కెలసి తేనియ లాని పాడుచున్న తుమ్మెదలమధురగీతమ్ములను గొలంకులఁ జెలంగుసరోజకాండములం గబళించురాయంచలు మున్నగుపులుగులయెలుంగులను శ్రవణోత్సవప్రదంబై సొంపారువ్రేపల్లియను గోఖురోద్ధూత రేణుప్రచ్ఛన్నరథుండై ప్రవేశించె. వచ్చినయచ్యుతసఖుండైనయుద్ధవుం గాంచి నందుఁడు గోవిందమతిం గౌఁగిలించికొని యాదరించి యుచితవిధిం బూజించి పరమాన్నంబుఁ గుడువంబెట్టి కృతాహారుం డైనయతనిం బాన్పునఁ బవ్వళింపఁజేసి కాళ్లొత్తి మార్గాయాసంబు పుచ్చి యిట్లనియె. మహాభాగా! మాచెలి యగువసుదేవుఁ డిడుమలెల్లఁ బాసి సుహృదులతోడఁ గూడి బిడ్డలు భార్యలు మున్నగువారితోడఁ గుశల మున్నవాఁడె? ధార్మికులు సాధువులు నగుయాదవులకెల్లప్రొద్దునుం గీడు రోయుచుండిన పాపాత్ముఁ డైనకంసుఁడు దనపాపమునం దెగియె. తన్నే నాథుఁగా నమ్మిన మమ్మును దల్లిని సుహృదులను సఖులను గోపాలురను వ్రేపల్లియను గోవులను బృందావనమును గోవర్ధనాద్రినిం గృష్ణుండు స్మరించునే? తమవారిం జూడ నాగోవిందుఁ డొకతూరి యిటకు వచ్చునే? స్మేరవిలోకితవిలసితం బైనయానుకుమారునెమ్మోము నెన్నఁడు గనుంగొందుమో? అమ్మహాత్ముఁడు దవాగ్నివలన వాతవర్షములవలన సర్ప వృషభములవలనను మఱియు నపరిహార్యము లైనవివిధమృత్యువులవలనను మమ్ముఁ గాచె. అమ్ముకుందునివిక్రమమును విలాసకటాక్షవీక్షణంబును జిఱునగవు సొంపును బలుకుబడినిం దలంచికొనినమాకుఁ బను లెవ్వియుఁ దోఁచవు. హరియడుగులం గడు బెడఁగైనవనగిరిసరిదాదితద్విహారప్రదేశములఁ గాంచు నెడ మాకుఁ దన్మయత్వం బడరెడు. గర్గాచార్యుండు సెప్పినచొప్పు దప్పక

రామకృష్ణులు సురకార్యము సాధింప నీధరిత్రి నవతరించిన దేవోత్తములని తలంచెద. కాకున్న నాగాయుతబలుం డైనకంసుని నామల్లవీరుల నాకువల యాపీడగజము నవలీలం బసులఁ బురిగొనుసింగముభంగిఁ దెగఁజూడను దాళ త్రయమాత్రం బైనయాఘోరకార్ముకంబు విఱువ నొక్కచేత నేడుదిన ములు చలింపక గోవర్ధనాద్రి యెత్తి వహింపను బకతృణావర్తాదిరాక్షసుల సంహరింపను గృష్ణునకును, బ్రలంబాదులం బరిమార్ప రామునకుం జెల్లునే? యని తలంచికొనితలంచికొని నందుండు ముకుందమయమానసుండై యశ్రు కంఠుఁడై ప్రేమాతిశయవిహ్వలుండై మిన్నకుండె. యశోద కొడుకుకథలు వర్ణించునెడ నాకర్ణించుచుఁ జన్నులు చేఁపఁ గన్నీరు రాల్చుచుండె. నందు నకు యశోదకును దామోదరునిపై నత్యూర్జితం బైనప్రేమానుబంధ మరసి యుద్ధవుఁడు నందగోపున కిట్లనియె. గోపాలవర్యా! సర్వగురుం డైననారా యణునిపై నిట్టియనురాగముఁ గాంచుటంజేసి దేహధారులలోనెల్ల మీరు పరమశ్లాఘనీయులు. ఈరామకృష్ణులు విశ్వమునకు నిమిత్తోపాదానకారణ భూతులు, ప్రధానపురుషాత్మకులునై యొప్పుదురు. ఆత్మసృష్టము లగుభూత ములలో ననుప్రవిష్టులై వీరు నానాభేదములకు జీవులకును నియామకులై యనాదులై సర్వకారణాత్ములై వెలయుదురు. ప్రాణావసానసమయంబున వీరి పయిం బరిశుద్ధచిత్తం బొక్కనిముసమేనియు నిశ్చలంబుగ నిలిపిన నరుండు కర్మవాసనలు నిస్తరించి రయమునం బ్రహ్మమయుండై శుద్ధసత్త్వమూర్తియై పరమగతిం బ్రాపించు. సర్వాత్ముండు సర్వహేతువు మాయామర్త్యమూర్తియు నగునారాయణునందు మీరు భావముఁ జేసినదాన నోమహాత్మా! మీ కిఁకఁ గర్తవ్యం బెయ్యది? వేగ వ్రేపల్లెకు భగవంతుఁ డరుగుదెంచి తన్నుఁ గాంచినతల్లిదండ్రులకుఁ బ్రీతి సేయు సకలయాదవులకుఁ బ్రతికూలుఁ డైన కంసునిఁ జంపి రంగమధ్యమున మీ కిచ్చినబాస వాసుదేవుండు దాను సత్యముగ నడపించుఁగాని తప్పఁడు. మహాభాగులారా! వగవం బనిలేదు. కృష్ణు నతిసన్నిహిత కాలముననే చూతురు. సమిత్తు నగ్నివోలె నతండు

సర్వభూతములహృదయములం దుండెడు. అమాని యైనతన కొక్కఁడు ప్రియుఁ డొక్కఁ డప్రియుఁ డొక్కఁ డుత్తముఁ డొక్కఁ డధముఁ డొక్కఁడు తుల్యుఁ డొక్కఁ డాత్మీయుఁ డొక్కఁడు పరకీయుఁడు ననుట లేకున్నను దల్లిదండ్రులు పుత్త్రకళత్త్రాదులును జన్మకర్మంబులు లేకున్నను సాధురక్షణార్థంబు సదసన్మిశ్రజన్మంబు లెత్తెడు. నిరీహుఁడయ్యు నప్పరమపురుషుఁడు ప్రకృతిగుణంబు లైన సత్త్వరజస్తమంబులం జెంది క్రీడార్థ మాగుణముల నీజగంబునకు సృష్టిస్థితిసంహారంబులఁ గావించు. కన్ను బ్రమరివాఱినవానికిఁ బుడమి దిరుగునట్లు దోఁచుచందమునఁ జిత్తము కార్యములఁ జేయుచుండ నందాత్మాధ్యాసమునం జేసి యాత్మునందుఁ గర్తృత్వ మారోపింపఁబడు. మీ కిరువురకే యమ్మహాత్ముఁ డాత్మజునిరీతిఁ బ్రీతిభాజనంబు గాఁడు. మఱి యందఱకు నాత్మజునిరీతిని మాతాపితరులవిధమునను బరమప్రేమాస్పదుండు. కన్నది విన్నది యతీతం బాగామియు వర్తమానంబును స్థావరంబును జంగమంబును మహత్తు నల్పంబును మఱియుఁ బ్రపంచమునం గలయఖిలంబును విష్ణుమయంబకాని తద్భిన్నంబుగాదు. అయ్యీశ్వరుండే పరమార్థభూతుం డని యుద్ధవుండు సెప్పిన విని నందుండును దదుచితంబుగఁ బలుకుచున్నంతఁ బ్రభాతం బయ్యె. అయ్యెడ గోపికలు మేలుకాంచి దీపముల వెలిఁగించి గృహసమ్మార్జనంబు నిర్వర్తించి వాస్తుపూజ సలిపి పెరుగు ద్రవ్వఁ దొడంగిరి. కవ్వపుఁద్రా డీడ్చునెడఁ జేతికంకణంబులుఁ గొప్పులోని విరులు గొప్పపిఱుందులుఁ జన్నుఁగవయు హారములుం గదలఁ జలత్కర్ణకుండల కాంతులు గండతలములం బర్వ నెమ్మొగమ్ములఁ గుంకుమారుణరుచులతోడం జెలిమి సేయఁ బెరుగు ద్రచ్చుచుఁ గృష్ణలీలలు పరమానందపరవశలై పాడుటయు దధిమథనరుతితోడం గలిసి హరిలీలాగానరవంబు పెల్లెసంగి దెసలంగలుగు నమంగళముల నడంగించె. అంత నంశుమంతుండు తూర్పునం దోఁచుటయు గోపకాంత లారివాఁకిట నున్నకనకరథముంగని యిదియెవ్వరియది? కంసుని కార్యము సాధింపఁ గమలాక్షుని మధురకుఁ గొనిపోయిన యయ్యక్రూరుండే

మగిడి వచ్చెనో? అతండు ప్రీతుఁ డైనభర్తకు మాచే నిష్కృతి సేయుం డనో? యని తమలోనం దలపోయుచున్నంత స్నానసంధ్యావందనాది కృత్యముల నిర్వర్తించి యుద్ధవుం డరుగుదెంచె.

అరుగుదెంచిన యాహరిపరిచరుని లంబమానపీనాయతబాహుయుగమున నొప్పువానిఁ గ్రొత్తామరలం దెగడుకన్నుఁగవ నలరువానిఁ బచ్చనిపట్టు వలువగట్టినవానిఁ గమలమాల నలరారువాని మణికుండలప్రభాపరీతగండతలములఁ జెలఁగునెమ్మొగమ్మున నుల్లసిల్లువానిం గాంచి గోపికలు బలే విశదమందహాసమున భాసిల్లునీసుందరుఁ డెవ్వఁ డెచ్చోటినుండి వచ్చినవాఁడు ముకుందునివేషభూషణంబు లీతండు దాల్చియుండెడు నని తమలోనం బలుకుచు నుత్సుకత్వమున నాకృష్ణపాదాశ్రయుం జేర నరిగి వినయావనతలై లజ్జాలలితస్మేరవీక్షణంబులను బ్రియభాషితములను సత్కరించి యుచితాసనాసీనుం డైన యాతనిహరిదూతఁగా నెఱింగి యేకాంతమున నిట్లని యడిగిరి. అయ్యా! యదుపతిపంచిన నేతెంచినదూత నీ వని యెఱుంగుదుము. తల్లిదండ్రులకుఁ బ్రియము సేయ నానాథుండు నిన్నుఁ బనిచెఁగాఁబోలు. కాకున్న నీగోకులంబున నతనికి స్మరణీయం బేమి గలుగు? మునులకును బిత్రాదిస్నేహానుబంధ మపరిహార్యము. తక్కినవారితోడఁ గార్యార్థంబు చెలిమి చేసిన నయ్యది పనిగలుగునంతకే చెల్లుఁగాని పిమ్మటఁ గన్పట్టదు. తేంట్లు తేనియకై పువ్వులఁ జేరునట్లు పురుషులు కార్యార్థంబు వనితలతోడఁ బొందు సేసి పనిదీఱినం ద్యజింతురు. వేశ్యలు క్షీణధనుని బ్రజ లసమర్థుఁ డైనరాజును జదివినశిష్యు లాచార్యుని ఋత్విజులు దక్షిణ యిచ్చినయజమానుని బక్షులు పండ్లుడిగినవృక్షము నతిథులు భోజనము వెట్టినవానిగృహమును మృగములు గాలినయడవిని జారపురుషుఁడు సంభుక్త యైనకామినినిం ద్యజించుట లోకదృష్టంబకదా యని గోపికాపికాలాపలు గోవిందునిపైఁ ద్రికరణంబు నిలిపి లోకవ్యాపారములు చాలించి యాలీలాగోపాలుండు బాల్యకైశోరదశలం గావించినచర్యలఁ

దలఁచి తలఁచి సిగ్గుడిగి పలవించుచుఁ దచ్చరితల నయ్యుద్ధవుని యెదురఁ బాడుచుండిరి.

## భ్రమరగీతలు.

అం దొక్కగోపసుందరి యొకమిళిందముం గాంచి కృష్ణసంగమముఁ జింతించుచు దానిం బ్రియుఁ డంపినదూతఁగా నెన్ని యిట్లనియె. ఓమధుకరమా! ధూర్తబాంధవమా! సవతాలికుచములదండడి నలంగిన పూదండ కంటుకొన్నకుంకుమపంకమున నమరుమీసలతో మాపాదంబు ముట్టవలదు. ఇట్టి నీ వెవ్వనికి దూతకృత్యంబు సలుప వచ్చితి వమ్మధుపతి యదుసభలోనం బరిహాసాస్పదం బైనతనవార్తెఱిఁగేనియ నొక్కతూరి గ్రోలఁ జను విచ్చి నీయట్టివాఁడు పూవులవిడుచువడువున నాతండు మమ్ము విడిచె. అట్టివానిపాదపద్మము నిందిర యెట్లు సేవించెను? ఆహా! తెలిసె. ఆనయగారియిచ్చకపుంబలుకులఁ జిత్తము మెత్తవడ నత్తామరసవాసిని యాసుందరుఁ జేరియుండవలయు. షట్పదమా! ప్రాంతపడ్డయయ్యాదుపతిచరితలం గృహరహిత లైనమాముందర మిక్కిలి పాడ నేల? ఆవిజయసఖుని యిప్పటిచెలులముందరఁ దత్ప్రసంగము పాడుము. వారు నీపాటకుఁగుచాలంకారము సెడఁ జొక్కి నీ కిష్ట మైనదాని నిత్తురు. అతనికపటపునగవులకును భ్రూభంగవిలాసములకు నీముల్లోకములలో నేముద్దియ లోఁబడకుండెడు? శ్రీదేవియే తత్పాదపరాగముఁ గోరి కొలుచునఁట. ఏ మెంతవారము? ఐనను దీనులయెడ దయఁ జూపుమహాత్మున కుత్తమశ్లోకశబ్దమన్వయించు నని నీవు చెప్పుము. శిరంబునం బెట్టుకొన్న పాదము విడువుము. ముకుందుఁడు పంపఁ దదీయదూతకార్యంబు నడపవచ్చి నయగారపుఁబలుకుల బుజ్జగింప నేర్చిననీనేర్పెల్ల నే నెఱుంగుదు. తనతదర్థంబు పతుల బిడ్డల నన్యలోకములనుం ద్యజించినవారి నాచపలచిత్తుండు విసర్జించె. ఇందు సంధియేమి గలదు? అతండు తొల్లి బోయమాడ్కిఁ గ్రూరుండై కపినాథుఁ డైనవాలిం జంపెనఁట. స్త్రీపరతంత్రుఁడై వలచివచ్చిన నెలఁతకు

విరూపత్వం బొనర్చెనఁట. బలిని యాచించి యతం డిచ్చినబలిం గొనియుఁ గాకివోలె నుపకారం బరయక యాదాతను బంధించెనఁట. అట్టికృష్ణునిచెలిమి యిఁకఁ జాలుఁజాలు. మూలముట్టి విడుతు మన్ననో తదీయకథార్థములు విడువఁగూడకుండెడు. అతనిచరితలపేరిటికర్ణామృతపుబిందువు లొక్కపరి గ్రోలినమాత్రన ద్వంద్వ ధర్మముల నెల్లఁ బాసి ప్రపంచాసక్తియెడలి గృహమును గుటుంబమునుం దెగడి భోగహీనులై పలువురుహంసాదిపక్షులరీతి భిక్షువృత్తి నడపుదురు. బోయవానియెలుఁగు మృగరుతం బనినమ్మిలేళ్లు తదీయశరవేదనం బడురీతి నేము దెలియక యాకుటిలునిపలుకు సత్య మని నమ్మి తదీయనఖస్పర్శ మునఁ దీవ్రంబైనమదనవ్యాధినొకపరిగని యడలితి మిఁకఁ జాలు. ఇతరవార్త సెప్పుము. ప్రియునిచెలికాఁడా! ప్రియతముఁ డంప మగిడి వచ్చితే? సన్మాన నార్హుఁడవుదువు. ఏమివలయునో కోరకొనుము. జంటవాయరాని యతని క్రేవకు మమ్ముఁ దోడ్కొనిపోవుదువో? ఓసౌమ్యుఁడా! యతనియురమునఁ గమలయనునువిద యెల్లపుడు నెడఁబాయకుండెను. అయ్యార్యపుత్త్రుండు మధురానగరి నిప్పు డున్నవాఁడే? ఈపితృగృహములను జుట్టలను గోపాలురను దలంచునే? తన యూడిగపువా రగుమాకథల నాతఁ డొకప్పుడైనం బ్రస్తావమునకుఁ దెచ్చునే? అమనోహరుఁ డగరుపరిమళము గుబులొకొనుపుతనభుజ మిఁక నెన్నఁడు మాశిరంబులం బెట్టునో యని పలికిన విని యుద్ధవుండు కృష్ణ దర్శనలాలస లైనయాగోపికలఁ బ్రియసందేశముల నూరార్చుచు నిట్లనియె.

## ఉద్ధవుఁడు గోపికలకుఁ గృష్ణసందేశంబు చెప్పుట.

గోపికలారా! భగవంతుఁ డైనవాసుదేవునిపై మన మిట్లు లర్పించిన కతంబున మీరు కృతార్థ లైతిరి. లోకపూజిత లైతిరి. ధ్యానవ్రతతపో హోమజపస్వాధ్యాయనియమములను మఱియుఁ బలుదెఱంగు లైనసత్కార్యములను నడపియుఁ గృష్ణునిపై భక్తి నలవరించికొన నరిది. మునులకును దుర్లభం బైనభగవద్భక్తిని మీరు భాగ్యమునఁ బడసితిరి. మీరు పతిపుత్త్ర,

బాంధవదేహగేహాదులం ద్యజించి కృష్ణునిఁ బరమపురుషుఁగా వరించి యయ్యధోక్షజునిపై నేకాంతభక్తిఁ జేసితిరి. విరహనిమిత్తమున మీకు భగవంతునిమీఁదఁ గలుగుప్రేమ మిట్టి దని నాకెఱుకపఱుచుట నన్ననుగ్రహించుటయే. నేను కృష్ణునకు రహస్యకార్యకరుఁ డైనపరిచరుఁడను. అమ్మహానుభావుఁడు మీకుఁ జెప్పఁ బంచిన సుఖావహం బైనసందేశముఁ దెచ్చితి. తత్ప్రకారంబు వినుఁడు. "చరాచరములందుఁ బంచభూతములరీతి ననుగతుఁడనై మనోబుద్ధీంద్రియముల కాశ్రయుఁడనై సర్వాత్ముఁడనై వర్తించు నావియోగము మీ కొకప్పుడునుం గలుగదు. నేను నన్నే యాత్మేచ్ఛం జేసి యాత్మమాయాప్రభావమున భూతేంద్రియగుణరూపమున సృజింతుఁ బాలింతు నుపసంహరింతు. ఆత్ముఁడు శుద్ధుఁడు గుణానన్వయుఁడు వ్యతిరిక్తుఁడు నయ్యు మాయాకార్యము లగుస్వప్నాదిమనోవృత్తులవిశ్వతైజసప్రాజ్ఞరూపములఁ దోఁచు. మేలుకాంచినవానికి స్వప్న మెట్టు లట్టులు మిథ్యాభూతంబులై బాధితంబు లైనయింద్రియార్థవిషయములఁ జింతించుచుఁ బురుషు నింద్రియములకుఁ జొనుపుమనస్సును దొలుత నిరోధింపఁ దగు. సాగరంబున నదులు సమాప్తి నొందువిధమున నీమనోనిరోధంబునందే సాంఖ్యయోగసన్న్యాసతపోదమసత్యంబు లనుసమామ్నాయంబు పర్యవసన్నంబు. ప్రియుఁ డైనయేను మీచూడ్కికి దవ్వున వసించుట మదనుధ్యానకాంక్షతో మనస్సునకు సన్నిధిసముత్కర్షంబుఁ గావించుతదర్థంబ కాని యొండు గాదు. దూరతరవర్తి యగుప్రియతమునిపై నెట్టు లట్టులు స్త్రీచిత్తము సన్నిహితునియెడం బాఱదు. సర్వవృత్తులు విసర్జించి నాపై మనసుపెట్టి నన్నే చింతించుటం జేసి మీరు వేగంబ నన్నుఁ బొందుదురు. ఆరేయి నన్నుఁ జేరరాఁ గడంగియుఁ బతులు వారింపఁ జేయునది లేక యింట నిలిచినవారు సమాహితధ్యానమున నన్నే పొంది" రని యిట్లు కృష్ణుండు మీకుఁ జెప్పి పుత్తెంచెనని యుద్ధవుండు సెప్పినం గోపిక లిట్లనిరి. యాదవులకుఁ గీడరోయుపాపాత్ముఁ డైనకంసుఁడు దనకుఁ గూర్చువారితోడ భాగ్యమునఁ

దెగటూరె. భాగ్యమున సర్వార్థములం బడసినయూపుత్తులతోడ నిప్పుడు కృష్ణుండు కుశల మున్నవాఁడు. లజ్జాస్నేహలలితస్మేర వీక్షణముల నేమర్చించినయచ్యుతుం డచ్చటం బురతరుణులకుఁ బ్రీతిఁగూర్చునే? రతివిశేషవిదుండైన యాప్రియుండు నాగరికనారీమణుల ప్రియవచనములను విలాసములను నెట్లు దవ్వులకుండెడు? ఆపురసరోజనేత్రల గోష్ఠిం దేలుచు గోవిందుఁడు కథాప్రస్తావమునఁ గ్రామ్యవనిత లగుమమ్మెప్పుడైనఁ దలంచునే? చల్లని వెన్నెల నల్లసిల్లుబృందావనంబున మామచ్చటలు మచ్చికమై వినుచుఁ గాలియందెలు రవళింప నింపు సొంపార రాసక్రీడ మాతోడ నాడినయారేలు కృష్ణుఁ డిప్పుడు దలంచునే? పర్జన్యుఁడు పయోధరముల వనముంబోలెఁ దన వియోగమునం బొగులుచున్న నిజాంగముల బ్రదికింప దాశార్హుఁ డిటకు విచ్చేయునే? పగఱం బరిమార్చి రాజ్యముఁ బడసినయవ్వీరుఁడు రాజకన్యకలం బెండ్లియై సుహృదులతో నట సుఖించుఁగాని యిట కేల వచ్చెడు? నిరాశత్వంబే పరమసౌఖ్యం బని తొల్లి స్వైరిణి యగుపింగళ పలికినదాని నెఱింగియు మాకుఁ గృష్ణునిమీఁదికోర్కి విడువరాకుండెడు. కోరకుండినను రమాదేవి తాన వలచి వచ్చి యెవ్వనియంగముఁ బాయకుండు నయ్యుత్తమ శ్లోకుని వార్త నెవ్వండు త్యజింపఁ గలఁడు? రామునితోడఁ గూడి కృష్ణుండు దిరిగినయీసరిద్గిరివనప్రదేశంబులు నతని కాపు వడసినగోవులు నావేణునాదములు నానందనందనుం బలుమాఱు దలఁపించెడు. లక్ష్మీనివాసంబులైన యతనియడుగులజాడలం గాంచి యే మతని మఱువ నోపము. తిన్ననినడవడిని లలితమందహాసముననుఁ బ్రణయవిలోకంబుననుఁ దియ్యనిపలుకులను జిత్తము తదాయత్తంబుగా నొం డెఱుంగని యే మెట్లు లతని మఱవ నేర్తుము? ఓనాథా! రమానాథా! యార్తినాశనా! గోవిందా! వ్యసనార్ణవమున మునిఁగినగోకులంబు నుద్ధరింపు మని ప్రార్థించి గోపికలు కృష్ణసందేశశ్రవణంబున వియోగవేదనం బాసి యుద్ధవునిఁ గృష్ణునిఁగ నతని నాత్మునిగను భావించి పూజించిన నుద్ధవుండు కృష్ణలీలలం గీర్తించుచు గోపకాంత

లకు ముదముఁ గూర్చుచుఁ గొన్ని నెలలు గోకులంబున వసించె. కృష్ణచరిత శ్రవణవినోదమునం జేసి యుద్ధవుఁడు వసించినదివసంబు లన్నియు వ్రజవాసులకు క్షణమాత్రప్రాయంబు లయ్యె. కృష్ణావేశనిమిత్తమున నావ్రేతల డెందములం గ్రందుకొన్న తదాదిస్నేహవిక్లబత్వముం గాంచి యుద్ధవుండు పరమసంతుష్టుండై వారికి మ్రొక్కుచుఁ దనలో నిట్లని చింతించె. సంసారభీతులైనమునులును భక్తులైనమేము నెద్దానిం గోరుదు మాగోవిందభక్తిని సర్వవిధముల గాఢముగఁ బడసినయాగోపికలజన్మంబకదా కృతార్థంబు. అనంతుని కథలపై ననురాగము గలవానికి శౌక్లసావిత్రయాజ్ఞికంబు లను బ్రహ్మజన్మంబులు గలిగిన నేమి గలుగకుండిన నేమి? అడవులలోఁ దిరుగు వ్యభిచారస్వభావలైనయీయాఁడువా రెక్కడ? పరమాత్ముఁడైనకృష్ణునిమీఁదిగాఢభక్తి యెక్కడ? తెలియనివాఁడేనియుఁ దన్ను సేవించిన నమృతమురీతి నీశ్వరుండు మేలు గావించెడు. రాసక్రీడావసరమున వాసుదేవుని బాహుదండములఁ గంఠాలింగనసుఖముఁ గన్నయీవల్లవాంగనల కొదవినమహాప్రసాదంబు నిత్యైకాంతరతి యగునిందిరాదేవికిని గమలగంధకాంతి నుల్లసిల్లు సురసుందరులకునుం గలుగదు. తక్కినవారిని లెక్కింప నేల? త్యజింపరాని స్వజనమును ధర్మమునుం ద్యజించి శ్రుతిమృగ్యం బైనముకుందపదవిం గాంచిన యీవల్లవీమణులపాదరేణువులఁ బడయుబృందావనతరులతాగుల్మౌషధులలో నొక్కటిగానేనియు నేఁబుట్టుదు? ఆప్తకాములైనయోగీశ్వరులును బ్రహ్మాదులును శ్రీదేవియు నాత్మలో నర్చింపఁ బెంపారుహరిచరణారవిందమును గుచములఁ గౌఁగిలించికొని తాపము విడిచి గోవిందకథాగానమున ముల్లోకములకుఁ బవిత్రతం గావించుగోపికలపాదపరాగంబునకు మ్రొక్కుదు నని తనలో ధ్యానించి యుద్ధవుండు వల్లవపల్లవపాణులను యశోదను నందుని గోపాలకుల నెల్లను వీడుకొని మగిడి మధుర కేతేరఁ దే రెక్కె. అట్టియెడ నందాదులు పలువిధములైనకానుకలు వెట్టి యనురాగమున నశ్రుపూరంబు గన్నులఁ గ్రమ్ము దేర నిట్లనిరి. మహాత్మా! మామనోవృత్తులు కృష్ణపాదారవింద

ముల నాశ్రయించెదు. వాగ్వృత్తులు తన్నామధేయములఁ గీర్తించెదు. కాయవృత్తులు తన్నమస్కారాదులఁ బ్రవర్తించెదు. కర్మానుబంధమున నీసంసారమునం బరిభ్రమించుచు మాకేజన్మమందైన నీశ్వరానుగ్రహమునం జేసి మంగళాచారములను దానములను గృష్ణునిపై రతి గలుగుఁగాక యని పలుకుచుఁ గృష్ణభక్తిపరత్వంబునం బూజించినఁ దత్పూజలం గొని యుద్ధవుండు మధువైరిపాలితంబైనమధురానగరంబునకుఁ జనుదెంచి కృష్ణునకుఁ గానుపించి మ్రొక్కి వ్రజవాసులభక్త్యుద్రేకము లెస్స వివరించి వారు వెట్టినకానుకల రామకృష్ణులకు సమర్పించె.

## కృష్ణుఁడు కుబ్జయింటికిఁ జని దానికిఁ బ్రీతిఁ గావించుట.

అట సర్వాత్ముఁడు సర్వదర్శనుఁడు నగుభగవంతుఁడు కామసంతప్తయైనకుబ్జయభిప్రాయం బెఱింగి దానికిఁ బ్రియ మాపాదించువాఁడై యుత్తమగృహోపకరణములను గామోద్దీపకంబులైనచిత్తరువులను ముక్తాహారచారుకేతనంబులను వితానశయనాసనంబులను నిండి సురభిధూపదీపచందనమాలికాదులఁ బరిష్కృతం బైనదానిగృహంబున నుద్ధవసమన్వితుండై యరిగె. తనయింటికి విచ్చేయుచున్న యన్నలినలోచనుం గాంచి యాదాసి తత్తఱంబున లేచి చెలులతోడ నెదురేగి యప్పరమపురుషుని దోడితెచ్చి యుత్తమాసనమున నాసీనుం జేసి పూజించి యుద్ధవునకుం దద్విధానంబునఁ బూజ గావింప నాతం డయ్యాసనము చేత నంటుచుఁ గృష్ణసన్నిధిం గ్రిందఁ గూర్చుండి తత్పూజల నంగీకరించె. అంతఁ గృష్ణుండు లోకవిడంబనం బనువర్తించి యుత్తమంబైనక్రొత్తపాన్పునొద్దకుఁ జనుటయు నవ్వనజాక్షి జలకమాడి కట్టితోడిగి పూసి పువ్వులు దుఱిమి తాంబూలచర్వణం బొనర్చి యమృతోపమం బైనయాసవం బాని యెల్లవిధములం గైసేసికొని వచ్చి లజ్జాలలితలీలాస్మితవిలసితవిలోకితములం గటాక్షించుచు ముకుందుచూడ్కి

కగపడ నొకయోర నిలిచె. క్రొత్తకూటమిం బాటిల్లుసిగ్గుపెల్లున జంకి దఱిసి రాక యించుకదవ్వ గలుగ నిలుచున్న యన్నెలఁతకంకణాలంకృతకరంబు వట్టి చేరఁ జీరి శౌరి మున్ను మైపూఁత యొసఁగి యాభాగ్యము గన్న యన్నాతిం బాన్పుపయిం జేర్చి రమించె. ఆరమణి రమారమణుపాణిపల్లవములను మదనతాపమున వ్రేఁగుకుచములందు నురమ్మునందుఁ గన్నుదోయి పయిం బెట్టికొని మూర్కొని యత్తాపంబు వాసి స్తనాంతరగతుం డైన యక్కాంతు నానందమూర్తిం గౌఁగిలించికొని మదనవేదనల విస్తరించె. అలభ్యుఁ డైనకైవల్యనాథు నంగరాగసమర్పణంబునం బొంది యామందభాగ్య యోప్రియతమా! నాతో నింకఁ గొన్నినాళ్లు వసించి రమింపుము. నిన్ను విడువఁ జాల నని కామసుఖంబే తుచ్ఛమతియై కోరెఁ గాని యాసర్వేశ్వరు నెద్దానిం గోరఁ దగు నప్పరమార్థముం గోరదయ్యె. దాని నుపలాలించి కామసుఖములఁ దేల్చి దేవకీసూనుం డట నుద్ధవునితోడ నగరికిఁ జనుదెంచె.

---

# ఉ త్త ర రా మా య ణ ము.

## తృతీయాశ్వాసము.

ఉత్తరరామాయణమును రచించినకవి కంకంటి పాపరాజు. ఈయన నెల్లూరుమండలవాసి. ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు. అనర్గళకవితాధార గలవాఁడు. శబ్దాలంకారములు మెండుగ నిందుండును. కథ ననుసరించి విచ్చలవిడిగా గ్రంథ మిది పెంచి వ్రాయఁబడినది. కవిబ్రహ్మయగు తిక్కన సోమయాజి నిర్వచనముగా దీనిని జిన్నతనమున వ్రాసెను. అంతకన్న నిది ప్రౌఢమైనది.

### కఠినపదముల కర్థాదులు.

ప. 1. నృపాల...చ్ఛటా=సముదాయము, దవాగ్ని = అడవులను గాల్చునగ్ని

ప. 2. బిట్టాగి=బిట్టు+ఆగి, బిట్టాగి, చక్కఁగా నడ్డగించి, అడవిదిర గుడుల్=వానరములు, లయాంబుదము=ప్రళయకాలమేఘము.

ప. 3. యశోజితతారుఁడు=కీర్తిచే జయింపఁబడిన నక్షత్రములుకల వాఁడు, రావణుఁడు=విశేషధ్వని చేయువాఁడు.

ప. 4. సమరక్రీడాభీలతర్=యుద్ధమను నాటయందలి దారుణత్వమును.

ప. 5. పరమేశ్వరుఁడు=పరదైవము.

ప. 6. కీకసావళుల్=ఎముకలగుంపులు, చతురబ్ధులు=నాల్గుసముద్రములు, ద్విగుసమాసము. అబ్ధి=నీరును ధరించునది. వ్యు.

ప. 8. మహి...మాలి-మహిత=శ్రేష్ఠమైన, అహి = వాసుకియను, గుణ=త్రాడుచేత, వేష్ట్యమాన = చుట్టఁబడిన, ఉరుమంథానమహీధర=గొప్ప మంథరపర్వతము, మాయా...కీలి = మాయావిలోనగు రాక్షసమాయాకానన ముల శోషిల్లఁజేయుట యనునాటయందు భయంకరదావాగ్నిజ్వాల, పాద... శైలి-పాదప=వృక్షములు, వ్రేళ్లచే నీటిని గ్రహించునని. వ్యు. నక్షత్ర పాళి=నక్షత్రములవరుస.

ప. 9. ఉదధి=ఉదమనఁగా నీరు, దానిని ధరించునది.

ప. 11. మార్తాండుఁడు=మృతమైనట్లున్న లోకము నుద్ధరించువాఁడు. కాంచనాద్రి=మేరువు, బాడబాగ్ని=సముద్రమున నడుగుననున్న యగ్ని, యామ్యప్రతాపము=యమసంబంధశౌర్యము, శోణము=ఎఱ్ఱనైన.

ప. 12. శాఖామృగమాత్రుఁగా=వానరమే యని.

ప. 13. కటాక్షదళచే=కనుఁగొనలచేతనే, పయోధులు=సముద్రములు.

ప. 14. ఆశరుఁడు=రాక్షసుఁడు, (రావణుఁడు) హరి=సింహము, యముఁడు, ఇంద్రచంద్రాదులు. నానార్థము.

ప. 15. అమేయబలము=చెప్పసాధ్యముగానిశక్తి, వేల్పులు-వికృతి. విబుధము-ప్రకృతి అమ్మక్క=ఆశ్చర్యార్థకము.

ప. 16. బిలుజ=సర్పము, పన్నగారి=గరుడుఁడు

ప. 17. ప్రత్యగ్రజంఝానిలము=క్రొత్తయోరగాలి.

ప. 18. తోయదము=మేఘము, నీరునిచ్చునది వ్యు. నియమధూర్వహమతి=నియమభారముగల బుద్ధిగలవాఁడు.

ప. 19. అలవోక=అలజడినొందక.

ప. 20. హా!=ఆశ్చర్యార్థకము, వీతాహంక్రియౌద్ధత్యుఁడు=పోయిన గర్వోద్రేకము గలవాఁడు.

ప. 21. గాద్గద్యంబు=డగ్గుత్తికపడుట, నిట్టూర్పులు=నిడుసూరుపులు.

ప. 22. నిరపాయదయాఢ్యుఁడవు=అపాయములేని దయతోఁగూడినవాఁడవు.

ప. 23. ఖడ్గంబు= శూలాయుధము, దిక్పాలశ్రేణి=ఇంద్రాగ్ని యమ నిర్ఋతి వరుణ వాయు కుబేరేశానులు. కక్షాంతరాళంబునన్=చంకలసందున.

ప. 24. లవంబు=లేశము, ప్లవంగము=ఎగురుచు నడచుస్వభావము గలది. వ్యు. పుంగవా=శ్రేష్ఠార్థము నిచ్చును.

ప. 25. నరభోజి=మనుష్యభక్షకుఁడు.

ప. 26. జగద్బాంధవసుతున్=సూర్యపుత్రుఁడగు సుగ్రీవుని.

ప. 27. మానముదారతన్=ఐశ్వర్యసమృద్ధిచేత.

ప. 28. కృతవీర్యాత్మజున్ = కార్తవీర్యార్జునుని, రేణుకాసుతున్= పరశురాముని.

---

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము—తృతీయాశ్వాసము.

ఇది కవిబ్రహ్మయగు తిక్కన సోమయాజిచే రచింపఁబడినది. విరాట పర్వమునుండి పదునేనుపర్వము లీకవి తెనిఁగించెను. ఈయననివాసము నెల్లూరు. నిర్వచనోత్తరరామాయణము రచించినది యీకవి బాల్యమునందు. అప్పటి కీయన యజ్ఞము చేయలేదు. కాఁబట్టి తిక్కన యనిపేరు. భాస్కర రామాయణమును రచించినమహాకవి భాస్కరుఁడు ఈయనతాత.

ప. 3. సూర్యసూనుఁడు=కర్ణుఁడు

ప. 7. కౌరవులు=కురువంశజనితులు, రాజునకుంగూరుతు=దుర్యోధనునకుఁ గావలసినవాఁడవు.

ప. 8 ఉపేంద్రుఁడు=కృష్ణుఁడు.

ప. 10. ముకుఁద్రాట=ముక్కునకుఁ గట్టుదారము.

ప. 14. పల్లవము=చిగురుటాకు.

ప. 19. ఓజమై = పరుసగా, పుండరీకాక్షుఁడు=తెల్లఁదామరలవంటి కన్నులు గలవాఁడు, చతుర్విధహృద్యాన్నము = భక్ష్యభోజ్యలేహ్యచోష్యములను నాలుగువిధములుగా నైనయాహారములు.

ప. 38. జనార్దనుఁడు=శత్రువులబాధించువాఁడు, నగధరుఁడు= కృష్ణుఁడు, గోవర్ధనము నెత్తినవాఁడు.

---

# భాస్కర రామాయణము

## ఆరణ్యకాండము—ద్వితీయాశ్వాసము.

ఈకవి రామాయణకవులలో మొదటివాఁడు. తిక్కన సోమయాజి తాత. రామాయణము నింత మనోహరముగా నెవ్వరును వ్రాయఁజాలరు. రామాయణమున కిది చక్కని తెనుఁగుకాదు. ఐనను కవిత్వము నిరుపమానము.

ప, 1. భర్మనిర్మిత=బంగారుచేఁ జేయఁబడిన, శలాకల=చక్కని కడ్డీలు, గొరిజలు=గిట్టలు, కనకకేసరాంకుర=బంగారు కింజల్కముల మొలకల వంటి, రోమకాంతి=రోమములకాంతి.

ప. 2. నెలలోనియిఱ్ఱికిన్=చంద్రునిలోనున్న లేడికి, నీలకంఠుఁడు= శివుఁడు, క్రొమ్మించులు=క్రొత్త+మించులు, క్రొత్తప్రకాశములు. క్రొత్త + కారు=క్రొక్కారు, త్రిభువనములు=స్వర్గమర్త్యపాతాళములు.

ప. 4. ధరణీసంజాత=సీతాదేవి, కాననాంతము=అరణ్యముచివర.

ప. 5. ఖురపుటమునన్=గిట్టలచివరలచేత.

ప. 6. సారంగంబున్=లేడిని, ఏనుఁగు, చాతకము, తుమ్మెద అని నానార్థము.

ప. 7. అసుర=సురను నిషేధించినవాఁడు, సమాసముకాని యపుడిది స్త్రీసమముగా నుండును. అగ్రజుఁడు=ముందు జన్మించినవాఁడు (అన్న).

ప. 10 కరువునన్=కరుగుటచేత, గండరువునన్ = పడియచ్చుచేత, ఇనచంద్రరుచులన్=సూర్యచంద్రులకాంతులను.

ప. 13. మృగలోచన=లేడికన్నులవంటి కన్నులుగలసీత, అనురా... భాసి=ప్రేమతోఁగూడిన తాత్పర్యమునఁబుట్టిన ప్రకాశముచే మెఱయుచు.

ప. 15. విన్నఁబోవుచు=దైన్యముతోఁగూడి, ఇంతయెఱుంగమి = ఇంతటి ప్రమాదము.

ప. 16. విలునమ్ములు=సమాసమున విలు, అని యగును. సమాసము కానిచో విల్లు అని.

ప. 18. వసుమతి = భూమి, రత్నములుగలది. వ్యు. అతులచపల మతులు=విశేషచాపల్యచిత్తములుగలవారు.

ప. 20. కాంతారము=కారడవి.

ప. 22. అలఁతికిఁజేరినన్=పట్ట సమీపింపఁగా.

ప. 23. తోరంపుటీరంబు = దట్టమగుపొద, ఆమృగవ్యాధరుద్రుఁడో=మృగములువెంట బోయవేషమునఁబోవు నాశివుఁడా.

# భాస్కర రామాయణము

## సుందరకాండము.

ప. 1. చరణాగ్రమునన్=బొట్టనవ్రేలఁచేత, (కైలాసమును రావణుఁ డెత్తినపు డీశ్వరుఁడు బొట్టనవ్రేలుచే నదుమఁగా రావణుఁడు భంగపడియె నని గాథ.) అని నిన్ను...పరశురాముఁ=యుద్ధమున నిన్ను బంధించిన కార్తవీర్యునిం జంపిన పరశురాముని, ఆజి=యుద్ధము.

ప. 3. దోస్థూణా...ములు = స్తంభములవంటి బాహ్వగ్రములచే వదలఁబడిన బంగారుపిడులరాపిడిచేఁ బుట్టినమిణుంగురుల సముదాయముల యొక్క గొప్పమంటలుగల బాణములు.

ప. 6. అజునివరము=బ్రహ్మవరము.

ప. 7. ఇనజుఁడు=సుగ్రీవుఁడు.

ప. 8. కాలపాశము=యమపాశము, శిరో...తంబు=శిలపైఁబిడుగుపాటు, కాలాహి=త్రాఁచు, కన్యాకారాగతమృత్యువు = కన్యారూపముగా వచ్చిన మృత్యుదేవత.

ప. 9. కోపస్ఫీతానలశిఖలు = కోపాతిశయమను నగ్నిహోత్రజ్వాలలు.

ప. 10. కుటిల ..డై=వంకరగానున్న కనుబొమలచే భయంకరమైన పదినొసళ్లచేత దారుణమగు గొప్పముక్కురంధ్రములచేత వాఁడియై వ్రేలాడు పెదవిచేత,...

ప. 12. కశాఘాతము=కొరడాదెబ్బ, ముండనము=క్షౌరము, అంగకర్తనము=దేహములో నొకభాగమును ఛేదించుట, అంకము=కాల్చినగుఱుతు పఱచుట.

ప. 14. నక్తంచరులు=రాక్షసులు, రాత్రిసంచరించువారు. వ్యు.

ప. 15. ఉద్ధతిన్=గర్వముచేత.

# భాగవతము

## సప్తమస్కంధము.

ఆంధ్రభాగవతమును రచించినమహాకవి బమ్మెరపోతనామాత్యుఁడు. కడపమండలములోని యొంటిమిట్ట ఈయననివాసము. ఒంటిమిట్టకు ఏకశిలానగరమను నామాంతరముగలదు. ఈమహాకవి వీరభద్రవిజయమును రచించినట్లు ప్రతీతిమాత్రము గలదు. అది యీయనచే రచింపఁబడలేదని కొందఱందురు. భోగినీదండకము పోతన చిఱుతకాలములో రచించెను. ఈయన వేంకటగిరిరాజాస్థానమందుండినట్లు జనశ్రుతికలదు. కాని యీయన రాజాశ్రయణము నభిలషించువాఁడు కాఁడని భాగవతమే వెనోళ్లఁ జాటుచున్నది. ఈమహాకవి వంశస్థులు కడపమండలములోనున్న కొమ్మద్దియనుగ్రామమున నుండినట్లును, అందుండి కామలాపురమునకు సమీపమందున్న కోడూరులోఁ గొంతకాల ముండినట్లును, అప్పుడు బమ్మెరయను నింటిపేరుపోయి కొమ్మద్దివారైనట్లును ఇటీవల కోడూరులోలభించిన తాళపత్రగ్రంథము 'సూక్ష్మతను విద్యావిలాస' మనుదానినుండి తేలుచున్నది. ఈకవియేకాక వీరి తర్వాతివారుకూడ కవులయినట్టు స్పష్టమగుచున్నది.

ప. 1. భృత్యుఁడు=భృతియనఁగా కూలి, దానివలన జీవించువాఁడు.

ప. 3. విషయసంపన్నుఁడు = విషయాభిలాషలుగలవాఁడు, పంచేంద్రియములు = త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు, హతాన్యతంత్రుఁడు= నశింపఁజేయఁబడిన యితరకృత్యములు గలవాఁడు.

ప. 5. వృత్తబంధంబులన్ = పద్యములయందిమిడించుటచేత.

ప. 6. ఫణిపతికిన్=ఆదిశేషునకు, భాషాపతికిన్=బ్రహ్మకు, భాష= శారదాదేవి.

ప. 8. చొక్కి=పరవశత్వమునొంది, జడతలేకయుం = నిశ్చేష్టుఁడు కాకుండియు.

ప. 9. పానీయంబులు=మంచినీరు.

ప. 10. అశ్రాంతము = ఎల్లప్పుడు, నలినాక్షుఁడు = పద్మాక్షుఁడు (విష్ణువు). ప్రణయహర్షజనితబాష్పసలిలమిళితపులకుండై =ప్రేమానందముచే జనించిన కన్నీటితోఁగూడిన గగుర్పాటుగలవాఁడై.

ప. 11. అతిరేకము=అతిశయము, నిర్వాణభావంబు=మోక్షభావము, అప్రమత్తుఁడు=పొరపాటులేనివాఁడు, మహాభాగధేయుండు=గొప్ప యదృష్టముగలవాఁడు, కర్మబంధలతాలవిత్రుండు = కర్మబంధములను తీఁగలకుఁ గొడవలివంటివాఁడు.

ప. 13. ప్రభావిశాలుర్=మాహాత్మ్యముచే గొప్పవానిని, కృపాలుర్ దయగలవానిని, సా...ఫాలుర్=సజ్జనులయు, గురువులయు సముదయము యొక్క పాదములయందు వంచఁబడిన నొసలుగలవానిని, విఖం...జాలు=నశింపఁజేయఁబడిన మోహలతాసంతతిగలవానిని, చెప్పవే=చెప్పుమా. ఇట ప్రార్థనార్థక క్రియ, చెప్పుము+ఏ అని పదవిభాగము.

ప. 15. సభ్యత్వంబునర్=శాంతముచేత, జాడ్యంబుతోర్=జడత్వముతో, తీవ్రమతి=సూక్ష్మబుద్ధిగలవాఁడు, దైత్యేభ్యుండు=రాక్షసశ్రేష్ఠుఁడు, సోత్కంఠుఁడు=ఉత్సాహముతోఁ గూడినవాఁడై.

ప. 16. సదసద్వివేకచతురత = మంచిసెబ్బరల నిర్ణయించు నేర్పు, తండ్రీ = ఇది ఆదరార్థబోధకము.

ప. 18. అస్మత్పి...గంధము=నాశౌర్యకథావాసన, మనోబంధుల్ = అంతరంగమిత్రములు, రక్షింపరే-ప్రార్థనార్థక క్రియ.

ప. 19. సహశ్రోతలు=కూడఁజదువువారు.

ప. 20. పఠింపించిరి=ప్రేరణార్థక క్రియ.

ప. 21. నిరూఢమనీషర్=నిశ్చితబుద్ధిచేత.

ప. 22 శంకా...డై=అనుమానముతోఁగూడిన మనస్సుగలవాఁడై, భ్రాంతుఁడు=ఏమియు నెఱుఁగని నాశోడుకని భావము, విద్యాపరిశ్రాంతి=విద్యయందుఁ జేయఁబడినకృషి, సౌధము = మేడ, సున్నముచేఁ గట్టఁబడినది. వ్యు.

ప. 23. భవ...తారకుర్ = సంసారసముద్రమును దరింపఁజేయువానిని, కామరోష...రకుర్=కామక్రోధలోభమోహమదమాత్సర్యములను నంతశ్శత్రువులనాఱుగురను దోలఁగఁదోలువానిని, కలుష...రకుర్=పాపరాసులనేమహాభీతిని గలిగించు నడవులకు గొడ్డలివంటివానిని.

ప. 25. ఉద్యోగము = ప్రయత్నము, అరూఢసంవిత్సంపన్నుఁడవు=నిశ్చితజ్ఞానముతోఁ గూడినవాఁడవై, ఉత్సంగాగ్రము=తొడపైన.

ప. 31. హరియంచున్ గిరియంచు-గిరియనునది నిందార్థకము.

ప. 33. అసద్గ్రాహ్యము=దుర్జనులచే నంగీకరింపఁబడినది.

ప. 34. జిజ్ఞాసాపదమందున్-జిజ్ఞాసా=తెలియునిచ్ఛ.

ప. 35. అయస్కాంతము=సూదంటురాయి.

ప. 36. తరంగిణులు=నదులు. రసాలపల్లవఖాది = తీయమామిడిచెట్టు చిగురుటాకును దినునట్టిది, కుటజములు=గిరిమల్లికలు, సాంద్రనీహారము= దట్టమగుమంచు.

ప. 38. పంచశరద్వయస్కుఁడవు=ఐదుసంవత్సరముల ప్రాయముగల వాఁడవు, నౌదలల్ = శిరస్సులు.

ప. 39. దైత్యచందనవనమందున్= రాక్షసులనే శ్రీచందనములుగల తోఁటయందు, కంటకయుతక్షితిజాతము = ముండ్లచెట్టు.

ప. 40. దనుజకుంజర = రాక్షసేంద్రా, కుంజరశబ్ద మిట శ్రేష్ఠవాచకము. వింటే=వింటివే అని మొదటిరూపము.

ప. 42. వర్గత్రితయము=ధర్మార్థకామములు.

ప. 43. అన్న-ఇది ఆదరార్థబోధకము.

ప. 46.అంభోజగర్భాదులు=బ్రహ్మాదులు,పుంభావము=పురుషరూపము.

ప. 47. నీతిపారగుఁడు=నీతిశాస్త్రమునఁ బండితుఁడు.

ప. 48. చుబుకంబు బుడికి=గడ్డము దువ్వి.

ప. 53. తనుహృద్భాషలన్=దేహమనోవాక్కులచేత.

ప. 54. కృతఘ్నావళీబంధుత్వంబులు = కృతఘ్నులతోఁ జుట్టరికములు, భస్మహావ్యములు=బూడిదలో హోమములు.

ప. 56. పవనగుంఫితచర్మభస్త్రి = గాలిచే నింపఁబడిన తోలుతిత్తి, తరుశాఖనిర్మితదర్వి=కఱ్ఱచేఁ జేయఁబడిన గరిటె. తనుకుడ్యజాలరంధ్రములు= దేహమనేగోడయందుండు కిటికీలరంధ్రములు, తరళసలిలబుద్బుదము=చంచలమగు నీటిబుగ్గ.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1936.